am-hb-1949-5-10

# ఆంధ్రమహిళ

సంపుటి 5 :: ఫిబ్రవరి '49 :: సంచిక 10

ముఖచిత్రం : భారతపిత బాపూజీ.




సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహాసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

—: ప్రచురణ :—

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు

ఫిబ్రవరి 11 వ తేది ప్రారంభము !

ప్రధానాంధ్ర కేంద్రములో




| ఛాయ : | శబ్దం : | కళ : | నృత్యం : | సంగీతం : | అసిస్టెంటు డైరెక్టర్ : |
|---|---|---|---|---|---|
| డి. ఎల్. నారాయణ. | సూర్యనారాయణ, | శర్మ | వెంపటి | ఘంటసాల | కొండయ్య |

---

DISTRIBUTORS FOR ANDHRA CEDED AND NIZAMS:

**CHAMARIA TALKIE DISTRIBUTORS**

VIJIAWADA–GUNTAKAL–SECUNDERABAD

---

*For Territorial rights*:

**SOBHANACHALA PICTURES Ltd.**

TEYNAMPET. MADRAS.

*For Mysore*:

**TALLUM PICTURES CIRCUIT**

BANGALORE CITY




సంపుటి 5 ఫిబ్రవరి 1949 సంచిక 10

# సంవత్సరము గడచి పోయినది

పూజ్య బాపూజీ మనలను విడచిపోయి సంవత్సరము గడచి పోయినది. ఆయన అడుగు జాడల ననుసరించుటయే, ఆయన దివ్యస్మృతికి అర్హచిహ్నమని మన మందఱము నొక్కి వక్కాణించాము. ఎంత వరకు ఈ మాటను క్రియారూపంలో పెట్టగలిగామనేది, మనము మననే ఈ రోజున ప్రశ్నించుకోవాలి. అహింసా తత్వాన్ని ఎంత వరకు అనుసరించామో, సత్యాన్ని ఎంత వరకు అన్వేషించామో, సర్వమానవ ప్రేమను, మత సామరస్యాన్ని ఎంతవరకు నెలకొల్ప బూనినామో—ఇవి, ఈ విషాద సమయమున మనము ఆత్మ పరిశీలన గావించుకొనవలసిన విషయములు. ఇది కేవలము వ్యక్తిగతమైన శోధన. ఈ ప్రథమ నిర్యాణ దివసమున, మనమా అమర జీవికి సమర్పింపగల నివేదన, ఈ ఆత్మ పరిశోధన యొక్క ఉత్తరువే.

బాపూజీ స్మారక నిధి నొకదానిని ఏర్పరుప దేశమంతా విశ్వప్రయత్నములు జరుగుచున్నవి. అదీ యిదీ అని, లక్షో తొంభై విధాలుగా యీ నిధి వ్యయపరుపబడునని ఏదో టూకీగా తెలియ జేయుట తప్ప, యీ నిధి సంఘమువారు, నిర్మాణయుతమైన ప్రణాళికను దేశ ప్రజకు అందించలేదు. ఒక చోట ఒక పార్కు, యింకో ప్రక్క నొక వైద్యశాల, ఇంకొకవంక ఒక శిలా విగ్రహము—ఇవి ఎప్పటికీ మహాత్ముని కర్హమైన స్మారక చిహ్నములు కానేరవు. కేవలము నిధి సంఘములోనున్న పదుగురు పెద్ద మనుష్యులే ఈ విషయమును నిర్ణయించక, ప్రజాభిప్రాయాన్ని విరివిగా సంపాదించిన తరువాత, ఎక్కువ ఉత్తమమైన స్మారక చిహ్నమును నిర్మించవలెనని హెచ్చరిక.

ఋషిసత్తముడైన గాంధీజీ యొక్క ఉపదేశాలు, వేదవాక్కులవలె, మానవుని జీవితములో నిత్యపారాయణ చేయవలసినవి. ఇట్టి మహాత్ముని రచనలు, ఉపన్యాసములు, ఆదేశములు, సర్వము స్వీకరించి ఒక కేంద్ర గ్రంథాలయమును స్థాపించి, భారత దేశీయ భాషలలోనే గాక, ప్రపంచ భాషలన్నింటిలో, వీనిని ముద్రించి, ప్రతి సామాన్య మానవునకు యీ గ్రంథములు సులభమైన వెలకు లభించు ఏర్పాట్లు చేయుట, యీ నిధి సంఘమువారియొక్క ఉత్కృష్టమైన

ధర్మము. ఇంతకు మించిన స్మారక చిహ్నము మరొకటి కానరాదు. ఇట్టి ప్రచారము, సత్య అహింసా ధర్మ ప్రచారమగును. ఇట్టి ప్రచారమే ఆ అమర జీవికి ఉత్తమోత్తమమైన స్మారక చిహ్నము.

# ఆంధ్రరాష్ట్రము — ఆకాశ సౌధమేనా?

"కొండనుత్రవ్వి ఎలుకనుబట్టిన సామెతగా నున్నద"న్నారు, ఎమ్. ఆర్. జయకరుగారు. హాస్యాస్పదమైన థార్ కమిటీ నివేదికను చదివి ఆంధ్రులకు మరొచెంపపెట్టని, ఎక్కువ ఆశా భంగమును కలిగించినదని వాపోయారు, రాష్ట్రవాదులైన ఆంధ్రనాయకులు. ప్రస్తుత పరిస్థితులకు థార్ కమిటీ నివేదిక చాలా అనుకూలంగా ఉన్నదని సర్ది చెప్పవచ్చారు, కాలానుసారులైన మరికొందఱు జాతీయవాదులమని చెప్పుకునే ఆంధ్ర ప్రముఖులు.

ఇటీవల అగ్రనాయకుల ధోరణికి దోహదంగా ఆంధ్ర నాయకులలో చెలరేగిన అనైక్యత, అవివేకము యీ నివేదికకు కారణముగావచ్చు. 'జల ఉష 'ను విశాఖపట్టణపురేవులో నెహ్రూ పండితుడు వదిలినప్పటి ఆంధ్రుల అవివేక ఆర్భాటమే, రాష్ట్రానికి స్వస్తి వాచకమైనది. మదరాసులో సరిహద్దు సంఘంవారి ఊరేగింపులు, ఆంధ్రులు జగడగొండులని బిరుదును సంపాదించి పెట్టాయి. దత్తమండలమువారి బెట్టు సరియైతేనేమి, స్వార్థపరతవల్ల తమిళపక్షపాతులైన ఆంధ్రుల వాఙ్మూలమువలన నేమి—ఆంధ్రులందఱిలో ఏకాభిప్రాయము శూన్యమని వెల్లడి అయినది. ఇప్పటికైనను ఆంధ్రులందఱూ ఏకమై, నివేదికలో రాష్ట్ర విభజన కూడదనుటకు వ్రాక్కుచ్చిన కారణములు ఆధారరహితములని నిరూపించినచో, కార్యము మించదేమో! ఆంధ్ర రాష్ట్రము కేవలమూ ఆకాశ సౌధము గాదేమో!

ఉద్యోగ స్వలాభకాంక్షులగు ఆంధ్రుల అలజడి తక్క, సామాన్యప్రజలో రాష్ట్ర విభజన కాంక్ష కనపడదనుట చాల అనుచితము. విభజనవలన కలుగు లాభనష్టములను గ్రహించగల విద్య సామాన్య ప్రజకు లేకపోవుటచేనేమి, స్వరాజ్యమునకై యింత పలవరించి, తుదకు స్వాతంత్ర్య ఫలితములు, పెద్ద పదవులలోనున్న కొద్దిమందికే అనుభవ యోగ్యములుగానున్నవి గాని, సామాన్యప్రజకు ఆహార వస్త్రాది ప్రాథమిక అవుసరాలనుగూడ కల్పించనేరకున్నవను నిస్పృహచేనేమి, సామాన్యప్రజ రాష్ట్రవాదమునందు ఉత్సాహము జూపకపోవచ్చుగాని, రాష్ట్ర విభజన కిదియొక ప్రతికూలకారణమని సర్ది చెప్పుట సామాన్యప్రజను మోసగించుటయే.

విభజనానంతరము ఆంధ్ర, తమిళరాష్ట్రములు స్వయంపోషకములుగానుండవనుట కల్లయని యిరుప్రక్కలవారు వాదించుటకు తగిన లెక్కలు థార్కమిటీవారికి అందలేదా? అందినచో యీ వితండవాదమెందుకో! రాష్ట్రవిభజన భాషాప్రయుక్తముగనున్న ఉపజాతీయత సంభవిస్తుందట! ఎవరి మాతృభాషలో వారు విద్య నభ్యసించి, వ్యవహారములను జూచుకొనుట కనువైన ఏర్పాటులు జేయుటవలన, ఎవరి సాంప్రదాయములను వారు అనుసరించుటవలన, జాతీయతకు

ముప్పు వాటిల్లుతుందట! అట్లాచూస్తే, మన స్వరాజ్యసంపాదనయే ప్రపంచనాయకుల అంతర్జాతీయతత్వానికి భిన్నమని అనుకోవాలా ? మన భాషను, మన సాంప్రదాయములను, మనదేశమును, అందుమూలంగా మనలనే మనము విస్మరించి, ఆంగ్లభాష, పాశ్చాత్య సాంప్రదాయములను అనుసరిస్తే, అంతర్జాతీయత అవలీలగా అబ్బేదని మనము నమ్మే మూఢస్థితిలో లేము గనుక, బ్రిటిష్ సామ్రాజ్య శృంఖలాలనుండి విముక్తిని ఏకగ్రీవంగా కోరాము. దేశస్వాతంత్ర్యానికి దారిజూపిన యీ మన విజ్ఞానమే వ్యక్తి స్వాతంత్ర్యాన్ని మన్నించే సామరస్యాన్ని ప్రోత్సహించాలి. వ్యక్తి నుండి, కుటుంబము, గ్రామము, తాలూకా, జిల్లా, రాష్ట్రము, దేశము, ప్రపంచము నిర్మింపబడ్డాయి. అలాగే, వ్యక్తి స్వాతంత్ర్యమునుండి, ఉపజాతీయత, జాతీయత, అంతర్జాతీయత క్రమంగా నిర్మింపబడాలి. వీనిలో ఏమెట్టులోపించినా, నిర్మాణము కుంటుపడ్తుంది.

కలగూరగంపలా, అందఱనూ కలిపియుంచినప్పుడు ఆబోతుకు ఆముదముపోసినట్లు, జాతీయ తత్వాని అందఱి మనసులలోకి జారవిడువచ్చునని కాబోలు వీరి తత్వము. వ్యక్తిగతమైన భిన్నత్వమునుండి, విశ్వమానవ ఏకత్వమునకు దారి యీ బలవంత బ్రాహ్మణార్థవిధానముకాదని చెప్పితీరాలి. వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని, భిన్నరుచిని, మన్నించిననాడే, మర్యాదచేసిననాడే, నిజమైన జాతీయత ఏర్పడుతుంది. జాతికి వ్యక్తి ప్రాధాన్యమెప్పుడు లోపిస్తుందో, అప్పుడే జాతీయత నశిస్తుంది.

క్రొత్తగా రాష్ట్ర విచారణకై ఏర్పడ్డ ముప్వురుపెద్దలు, రాజ్యాంగ పరిషత్తువారు కూడ యీ విషయమై తీవ్రముగ నాలోచించి, ప్రజలచే కోరబడి, విద్యాధికులచే ప్రశంసించబడి, కాంగ్రెసుచే వాగ్దానము చేయబడ్డ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమును సత్వరముగ జేయుదురని ఆశించుచున్నాము.



## శుభ సంఘటన

కాశ్మీరు రంగములో, యీనాటికి యుద్ధ విరమణకు, భారతీయ, పాకిస్థాన్ ప్రభుత్వాలు రెండూ అంగీకరించినవి. కాశ్మీరు ఏ ప్రభుత్వముతో జేరవలసినదియు, జనవాక్యమూలంగా నిర్ధారణ సేయుటకై భద్రతా సమితి సహాయముచే, యిరు కక్షులవారు అంగీకరించిరి. శాంతి మార్గంగా యీ నిర్ధారణ కాగలదనియు, యికమీద భారత దేశములో అంతర్యుద్ధముండరాదనియు, స్వరాజ్య సంపాదనతో ప్రారంభమైన రక్త వెల్లువలు, యీ సంధితో నదృశ్యము కాగలవనియు ఆశిస్తున్నాము. సంవత్సరన్నరగా అద్భుత సాహసములతో కాశ్మీరు రణరంగంలో ధర్మస్థాపనకై పోరిన భారతీయ యుద్ధ వీరులకు

# విషాదవీచి

ఎవ్వఁడవోయి నీహృదయ మెంతటి కర్కశమోయి బాపుజీ
నిర్విధి హత్యజేయ మనసేటికి గల్గినదోయి ఇంకనీ
వెవ్విధమైన మేలు ప్రజకేర్పడ జేయుదువోయి ఎన్నఁడే
నెవ్వరి కెట్టి హానియును నెంచియెరుంగని సాధుమూర్తియే

బాలికల తోడుతన్ కాలిబాట నడచి
వచ్చు ఖద్దరు కొల్లాయి వస్త్రధారి
కపట మెరుగని పూజ్య వక్షస్స్థలంబు
కాల్పగా చేతు లెట్టులు కదలెనోయి !

చెరియొక ప్రక్కనొద్దికగ చేరినముద్దుల మన్మరాండ్రతో
నరుగుచునున్న యాఋషిని హత్యయొనర్చెడు కాంక్షతోడ నీ
వరసిన వేళ హృత్కమలమం దిసుమంతయు జంకుదోపదే !
కరకు కసాయివే ! శిధిలగాత్రుని శుష్కపు గుండెవ్రేల్తువే !

* * *

బాపుజీ గుండెలో జొరబారి ప్రాణ
హానిగల్గించినట్టి పాషాణగుళిక
కోట్లకొలది జనంబుల గుండెలందు
నాటుకొన్నది యొక రెప్పపాటులోన

పావనమైన నీయశము పాడుకొనెన్ నలుదిక్కులందు ; ని
ర్జీవుడవైన నేమి మృతజీవివి ! నీమహనీయ సూక్తు లె
న్నో విననోచమైతిమని యుత్తలమందెడు మానవాళియే
జీవములుండియున్ విగతజీవితులైరి మహాత్మ నేటికిన్

అంతములేని నీహృదయమందలి ప్రేమకు సాక్షి గాంధిజీ
అంతమునందెనంచు వినినంతనె యుల్లము తల్లడిల్ల ని
ర్ఘాంతము జెందినట్టి జనరాశియె సుమ్ము మహాత్మ ! ఎందరో
ఇంతకు ముందుపోరె, ఇటులేడ్చెనె లోకము వారిగానకన్ !

దారిచూపించు నొకజ్యోతి ఆరిపోయె
అడ్డుగానని యొకవాణి ఆగిపోయె
వెలుగులేకయు జనకుని పలుకులేక
జరుగుటెట్లని అన్నలు జంకినారు.

* * *

వందనముతోడ ప్రార్థనా మందిరంబు
చేరవచ్చెడు బాపుజీ చిత్తసీమ
నిండుకొన్నట్టి భక్తితో నిండుకొనియె
పావనాత్ముని భూలోక జీవయాత్ర.

గారవంబుగ చెంతకు జేరి తలల
చేతులానించి నడచెడు తాతగారి
నిండుప్రేమను గొన్నమీ గుండెలెట్లు
కొట్టుకొన్నవో బాపుజీ కూలినపుడు !

కన్నులుమూసి, నిశ్చలముగా పరమాత్మను గూర్చిధ్యాన మం
దున్నవిధంబుగా చెడకయుండిన ప్రాంజలితోడ, భూస్థలిన్
పన్నిన మీపితామహుని పాటున కెంతయు భీతిజెందుచున్
చిన్నికరాలతో నిలుప చిత్తము లేగతి తత్తరించెనో !

చిమ్ముచుండిన గుండెరక్తమ్ము జూచి
సొమ్మసిల్లిన తాతమొగమ్ము జూచి
క్రమ్ముచుండిన జనసమూహమ్ము లోన
నిమ్మళించని దుఃఖభారమ్ము తోడ
గాలికల్లాడు దీపంబువోలె మెరయు
ఆశలేశముతో హృదయాలు తొణక
పొంగివచ్చెడి శోకమ్ము మ్రింగు కొనుచు
వచ్చిచేరిరి బిర్లావభంతి లోన !

శ్రీమతి దొప్పలపూడి అనసూయగారు

## వి షా ద వీ చి

సేవజేసెడు వైద్యులు చేష్టదక్కి
అస్తమించెను బాపుజీ యన్నతోడ
గొల్లుమన్నారె గుండెలు కూలిపోవ
తాతనిర్జీవ గాత్రంబు తడవి కొనుచు!

చనువిచ్చు తాతగారిటు
అనుకోని దురంతహత్య కాహుతియౌటన్
కనులార గాంచినప్పుడు
జనియించిన భీతిచెప్ప శక్యంబగునే

వినినంత విస్తుపోయిరి
జనమంతయు చేరిచూడ జాలని దూరం
బుననున్న మాకుసరియే
వెనువెంటనె యుంట నెంత వెరచిరో తల్లీ!

*　　*　　*

దేశదేశాల చింతింప జేసినట్టి
ప్రాణవిభు హత్యకున్ గుండెపగులకుండ
ముందుగా స్వర్గ ధామమ్ము నందు జేర
జనిన నీవెంతటి యదృష్టశాలివమ్మ!

భువిని వైధవ్యభారమ్ము పొందకుండ
శాశ్వతమ్ముగ హృదయేశు సరసజేరి
ఇంక కొనుచుందు వమ్మ నీ వెల్లచోట్ల
సుమయుతంబగు పసుపు కుంకుమలపూజ!
అమ్మ, కస్తూరిబాయి! నాడస్తమించి
ఆత్మపతి అశ్రుతర్పణ మందినావు
నేడు భరతోర్వితో గోడుగోడు మంచు
మూర్ఛలో మున్గ దుస్తరముప్పు తప్పె

*　　*　　*

ఆనాడు క్రీస్తుదేవుడు
ఈనాడు మహాత్మగాంధి హృత్ఫలకములన్
పోనాడని గాయాలిడి
పోనాడిరి ప్రాణములను పూజ్యచరిత్రుల్.

*　　*　　*

లోకమెట్టి స్థితికి లోనుగానున్నదో
వెలుగుజూపు ప్రభువు తొలగినాడు
ప్రళయవేళ వచ్చిపడియెనో కలహాగ్ని
చుట్టుముట్టడింప జొచ్చె భువిని



# పూజ్య బాపూజీ లక్ష్యసాధనమే మన కర్తవ్యము

శ్రీ మంత్రి లక్ష్మీ ప్రసూనాంబగారి వ్యాసమునుండి

భారత భాగ్య విధాత, స్వాతంత్ర్య ప్రదాత మహాత్మాజీ దివ్యజ్యోతి విశ్వకాంతిలో లీనమై పోయినది. ఇక భారత పిత భౌతిక దేహము మనము చూడ జాలము. పూజ్య బాపూజీ దుర్మరణమునకు భారత జాతి, యావత్తు ప్రపంచము దుఃఖసముద్రములో మునిగి పోయినది. మన సచివుడు, మన సారథి, మనలను విడిచి పోయినయీ విషాద సమయములో మన మేమి చేయవలెను? యావద్భారత దేశమునకు యిది యొక విషాద ఘట్టము. యావద్భారతదేశము, విశ్వమంతా యీ విషాద సంఘటనకు ఘూర్ణిల్లినది. దాశ్య శృంఖములతోటి బంధింపబడిన భారత జాతిని రక్త తృష్ణలేని అహింసాయుధముచే స్వాతంత్ర్యపథమునకు తెచ్చిన దివ్య జ్యోతి మన బాపూజీ. అహింస అనెడి ఆయుధము తోటి విదేశ పరిపాలనను రూపుమాపిన మహావీరుడు. కేవలము స్వాతంత్ర్య సిద్ధికేగాక మత సామరస్యంకోసం కూడ చాల కృషి చేసాడు.

భారత దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించిన వెంటనే దేశములో నలు మూలల మతవైషమ్యములు పెరిగి హత్యాకాండ జరుగ నారంభించినది. యిదే సమయమున తూర్పు పంజాబులో ముస్లింలు హిందువులను చిత్రహింసలు చేసారు. ఇది జరిగిన వెంటనే చాలమంది హృదయాలలో ప్రతీ కారవాంఛ ప్రబలి క్రియా రూపందాల్చినది. మహమ్మదీయులను మన హిందువులు చంపుట, వారి యిండ్లను తగుల బెట్టుట మొదలగు అనేక చిత్ర హింసలు చేయనారంభించిరి. మహాత్మాజీకి యీ విషయము తెలిసిన వెంటనే వారి ఆత్మకు మిగుల బాధగలిగినది. యిదియు పాకిస్తాన్ ఆర్థిక విషయమును గురించి గాంధీజీ నిరశనవ్రతము చేయనారంభించారు. శాంతి స్థాపన జరుగునంతవరకు విరమించనని చెప్పినారు. అప్పుడు నాయకులంతా సమావేశమయి పాకిస్తాన్‌కు ఆర్థిక ఒడంబడిక కుదిర్చి, శాంతి స్థాపన జేసే షరతుమీదనే మహాత్ముడు ఒక గ్లాసు నారింజ రసమును పుచ్చు కొన్నారు. ఈ విధముగ మత సామరస్యముకోసం తన ప్రాణాలను సమర్పింప పూనిన త్యాగధనుడు గాంధీజీ. మన దేశ మసలే మత విద్వేషములతో అతి దారుణంగానున్నది. మహాత్ముని హత్యానంతరం ఈ సంఘర్షనల వైఖరిలో ఏర్పడిన మార్పుల వలన మనం జాగరూకులమై యుండకపోతే మనలో మనకే విబేధాలింకా అధికమై అరాజకత్వంతో దేశం అధోగతి పాలైపోతుంది. ఈ దారుణ రాజకీయ నైతిక దశలో మహాత్ముని సజీవాదేశాలు మనకు లభించే అవకాశం పోయినది. ఆయన అపూర్వాదర్శ జీవితములో ఆయన ప్రసాదించిన విజ్ఞానమును మనము సక్రమంగా అనుష్టించి నట్లయితే ఇంకా పూర్తిగా నష్టపడక పూర్వమే మనము మన జాతిని పవిత్రమైనదిగాను, శక్తివంతమైనదిగాను చేసుకొనగలుగుదుము. భయము, కోపము దరిచేరనీయవద్దని అడుగడుగునా మహాత్ముడు మనజాతిని హెచ్చరిస్తూ వుండెడివాడు, హంతకుడు కూడ

## పూజ్య బాపూజీ లక్ష్యసాధనమే మన కర్తవ్యము

ఒక రాత్రి అయినా అవకాశము యిచ్చియున్నట్లయితే క్రీస్తువలెనే తానుగూడ అవతారము చాలించడానికి పూర్వం• "భగవాన్ అతడు తానేమి చేస్తున్నది తెలియక ఈ పని చేసాడు. కనుక క్షమించ"మని పరమేశ్వరుని తప్పక ప్రార్థించియుండెడివాడు. భగవంతుడే సర్వమానవ హృదయాలకు అధినేత అనీ అతడే న్యాయ నిర్ణేత అని జీసస్‌వలెనే మహాత్ముడుకూడ విశ్వసిస్తూ వుండేవాడు. నేడు భారత జ్యోతి అస్తమించినది. ప్రతి భారతీయునకు యిపుడు బాపూజీ లక్ష్యాన్ని సాధించడమే కర్తవ్యం.

మహాత్మాజీ ధర్మసంస్థాపనార్థమే జీవించారు. అందు నిమిత్తమే మరణము పొందినారు. నేడు మనమందరము భారత జనకుని ఆశయ సాధనకై ప్రయత్నము చేయాలి. "నీవు మానవుడవు; బానిస బ్రతుకునీచము. అదిగో స్వాతంత్ర్య పథం" అని మనలను కేలూని స్వరాజ్య సౌధానికి నడిపిన భారత జనకుడు బాపూ. ఈ మహాశయుని రక్తతృష్ణలేని అహింసా ఆయుధాన్నే మనము చేబూనాలి. నేడు మన సారథి అస్తమించుటచే మనమనేకవిషాదఘట్టములను యెదుర్కొనవలసివచ్చినది. యిట్టి సమయములో ప్రతీకారము, హింస, ద్వేషము, మొదలగునవియన్నియు దరిచేరకుండ నిర్మూలింపజేయాలి. అప్పుడే మన పూజ్య బాపూజీ ఆత్మకు శాంతి చేకూరుతుంది. సహనము ధైర్యము, ఐక్యత, ప్రేమ, ధీరత్వమును ప్రతి భారతీయుడు అవలంబించి, మహాత్మాజీ ఆదర్శములను అనుసరించినప్పుడే, మన దేశము ముందుకునడచును. ప్రపంచమునకు శాంతి మార్గమును చూపిన రోజుననే అమరజీవి యయిన బాపూజీ ఆత్మకు శాంతి చేకూర్చినవార మగుదుము.



## మన సామెతలు

1. అకటావికటపు రాజునకు అవివేకిప్రధాని, చాదస్తపు పరివారము.

2. అగడ్తలో పడ్డ పిల్లికి అదే వైకుంఠం.

3. అల్పునకు ఐశ్వర్యం వస్తే, అర్థరాత్రి గొడుగు తెమ్మన్నాడట.

4. ఆచారానికి అంతములేదు, అనాచారానికి ఆదిలేదు.

5. ఆడేకాలు పాడేనోరూ ఊరకోవు.

6. ఆత్రగానికి తెలివిమట్టు.

7. ఇంటిదొంగను యీశ్వరుడైనాపట్టలేడు.

8. ఇచ్చేవానికి పత్రమూ వద్దు, చచ్చేవానికి మందూ వద్దు.

9. ఇచ్చి వచ్చే నిష్ఠురముకన్నా, యివ్వక వచ్చే నిష్ఠురము నయము.

10. ఈత చెట్టుకింద పాలు తాగినా కల్లే అంటారు.

11. ఈతకు మించిన లోతూ, గోచికి మించిన దారిద్ర్యము లేదు.

12. ఈ పిల్లి ఆ పాలు త్రాగునా?

* * *

కూర్పు: చిరంజీవి సుభాషిణి

# బాపూజీకి భాష్పాంజలి!

("భారత భూమి మనదే కానీ..." వరుసలో)

మమువిడనాడితివా మహాత్మా
మహినిక గనపడవా......
మతవిద్వేషము మాన్పుటకొరకై
అసువుల నొసగితివా మహాత్మా
మమువిడనాడితివా ||మ||

* * *

జ్యోతిర్మయమగు నీ బోధామృత
ము...జనులకు నేటికి కరువాయె,
నీ నిర్యాణము నిజమో కాదో,
మనమున దోపదుగా!......
మాకిక గనపడవా ||మ||

* * *

పేదసాదలకు పెన్నిధివీవె,
దేశ దాస్యమును బాపితివీవె,
సత్య అహింసల పథగాముడవై
యమునకు నడచితివా ?......
మహినిను గనలేమా ||మ||

* * *

అమర జీవి

మాలమాదిగను బేధముబాపి,
మానవ సేవా మహిమనుజాటి,
గీతాబోధల బాటను జూపి,
రాముని జేరితివా ?......
మమువిడనాడితివా ||మ||

* * *

నీదు ఆత్మలో రాముని మూర్తీ,
నీదు దృష్టిలో నైక్యపుశక్తీ,
నీయడుగుల చిరతరమగుశాంతీ
నిలచి వెలిగె గాదా...
మాకిక గనపడవా ||మ||

* * *

సత్యాగ్రహమొక సమర మొనర్చి
నిత్యాహింసా వ్రతమును నేర్పి
సత్యాన్వేషణ సఫలత జూపి,
ధన్యుడ వైతివిగా...
మమువిడనాడితివా ||మ||

* * *

బాలబాలికలు జ్యోతలు సేయా
భారత నారులు హారతులీయా
బాపూరుధిరమె భారత సంతతి
ప్రగతిని జూపునుగా......
ప్రభమై వెలయునుగా ||మ||

---

శ్రీమతి డి. యస్. రాజేశ్వరీపట్నాయక్ గారు

---

స్వ వి ష య ము :

# ఆంధ్ర మహిళాసభలో

అఖిల భారత కాంగ్రెస్ మహాసభాధ్యక్షులైన

శ్రీ డా॥ భో. పట్టాభి సీతారామయ్యగారికి

ఆంధ్ర మహిళాసభ సమర్పించుకొన్న

## స్వాగత పత్రము

మహాశయా, రాష్ట్రపతీ,

సుస్వాగతము

అఖిల భారత కాంగ్రెస్ మహాసంస్థలో, సరిగా అర్ధశతాబ్దము, అకుంఠిత సేవాదీక్షతో, అనేక యుద్ధములలో నారితేరిన వీరులైన తమకు, రాష్ట్రపతి పదవి లభించుట, మాకందరకు అపరిమితమైన ఆనందమును కలిగించుచున్నది. పరతంత్ర భారతావనిలో కాంగ్రెసు చరిత్రను రచియించిన కవివర్యులకు, స్వతంత్ర భారతోర్విలో కాంగ్రెసు చరిత్రను నిర్మింపగల సదవకాశము లభించినది. ప్రస్తుతము, దేశాభ్యుదయాన్ని అరికట్టూ ఉన్న క్లిష్టాతిక్లిష్టతర పరిస్థితులను అతిక్రమించగల, క్రమబద్ధమైన, నిర్మాణ కార్యక్రమ పంథా నొకదానిని సమాలోచించి కాంగ్రెసు సంస్థయొక్క అద్వితీయ సాంప్రదాయాను గుణముగా, ప్రజారక్షకులై, భారత జాతీయ రథ చోదకులై, తమపైనున్న గురుతర కర్తవ్య బాధ్యతను అమోఘముగా నెరవేర్చగలరని సంపూర్ణముగా విశ్వసించుచున్నాము. ఈ మహత్తర కార్య నిర్వహణలో, మా సంపూర్ణమైన సానుభూతిని, సహకారమును, స్వీకరించవలసినదిగా మా మనవి.

జాతీయ విద్యాభావనకు ప్రత్యక్షరూపమొసగి, అణగిపోయిన కుటీర పరిశ్రమలను పునరుద్ధరించుటలో అమూల్యకృషిసల్పిన తమ అడుగుజాడల ననుసరించుచూ, నారీ జనాభ్యుదయానికి, అధికశ్రద్ధతో మా యీ చిన్ని సంస్థ యొనర్చుచున్న సేవ తమకు చిరపరిచితమే. స్త్రీలయొక్కయు, శిశువులయొక్కయు, ఉపయోగార్థము రోగి సంరక్షణాలయము నొకదానిని, త్వరలోనే నిర్మింపవలెనను ఆశతో మేము కృషిచేయుచున్నాము. తమయొక్క హృదయపూర్వక ఆశీర్వాదములు, సానుభూతి దోహదముకాగా, చిన్న మొక్కగానున్న మా యీ సేవాకార్యక్రమము, పెద్దవృక్షమై, చిలవలపలవలతో, సర్వతోముఖముగా వ్యాపించ గలదని ఆశించుచున్నాము.

సేవాతత్పరులు, అనుభవజ్ఞులునగు తమ రాకచే మా సంస్థ పావనమైనది. మా హృదయము లపరిమితానందభరితములైనవి. ఈ అవకాశమును మా కొసంగిన తమకు మా ధన్యవాదములు. భగవంతుడు తమకు ఆయురారోగ్యము లిచ్చి, పటుతర శక్తిసామర్థ్యములతో తమ కార్యభారమును నిర్వహించకలుగునట్లు తోడ్పడవలెనని ప్రార్థించుచున్నాము.

## సమావేశ వివరాలు

17-1-49 తేదీ సాయంకాలము గం 6½ లకు మన రాష్ట్రపతులగు శ్రీ డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారికి ఆంధ్ర మహిళా సభలో సన్మానసభ జరిగినది. ప్రప్రథమమున విద్యార్థినులు, రాష్ట్రపతికి గౌరవవందన మాచరించిరి. సభకు శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారు అధ్యక్షతవహించిరి. సభకు శ్రీప్రకాశం పంతులుగారు, బులుసు సాంబమూర్తిగారు, వేపా రామేశం పంతులుగారు, న్యా॥ రాఘవరావుగారు, కాంగ్రెసు కార్యదర్శియగు కళా వెంకట్రావుగారు, మొదలగు ప్రముఖులు విచ్చేసిరి. శ్రీమతి సావిత్రీ రాజః , బీగమ్ అమిరుద్దీన్, మిసెస్ ఇంద్రసేన్ గారలు సభయందుపన్యసించిరి.

అధ్యక్షురాలు ప్రారంభోపన్యాసమున హిందూ లా సవరణ చట్టమును, ప్రభుత్వము వారు వెంటనే శాసనముగా చేయవలయుననియు, అందునూ మద్రాసు సభ్యులు ఎక్కువగా పాటుపడవలెననియు చెప్పిరి. ఇంతమాత్రమే కాదు, శ్రీ డా॥ రాజేంద్రప్రసాదుగారు దీనిని ప్రస్తుతం నిలుపుచేయవలెనని చెప్పినదానిని స్త్రీ సంఘములు ఆమోదించుటలేదనియు, ఇందుకై సోదరులు పట్టాభి సీతారామయ్యగారు పైచట్టము అమలు జరుగునట్లు చూచెదరని ఆశించిరి.

పిమ్మట సావిత్రీ రాజన్‌గారు డా॥ భో. పట్టాభి సీతా రామయ్య గారి గుణాతిశయములను మిగుల పొగడి హిందూలా సవరణ విషయమై శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారు చెప్పిన దానినే బలపర్చిరి.

తరువాత బీగం అమిరుద్దీన్‌గారు లేచి డాక్టరుగారి విశేషగుణములను మిగుల జెప్పుచూ వీరు గాంధీగారి ప్రియ శిష్యులనియు, పెక్కేండ్లకు పూర్వమే వీరు రాష్ట్రపతులు కావలసియుండిననూ, అప్పుడు గాంధీజీ వీరి విషయమై ప్రయత్నించిననూ వేరు కారణములచే కాకపోయినదనియు, డాక్టరుగారగుటచే వీరు మనుజుల శారీరక బాధలను తొలగించుటయేగాక తమ అనల్పబోధామృతముచే మానసిక బాధలనుకూడా తొలగించు సామర్థ్యముగలవారనియు, ఆమె ముస్లిం స్త్రీయగుటచే హిందూ లా విషయమై యంత ప్రశక్తిలేకుండిననూ అందు స్త్రీలవిషయమైన హక్కులకు రాష్ట్రపతి తీవ్రకృషిచేయవలెనని కోరుచుండిరనియు చెప్పిరి. మరియు పట్టాభిగారు మద్రాసు శాసనసభ్యులకు పర్మిట్లను పుచ్చుకొనరాదని యాదేశించుటలో, వీరికి నీతియందుగల శ్లాఘ్యతరాదరము కాన్పించుచున్నదనియు పరమేశ్వరుడు వీరికి ఆయురారోగ్యములను, కార్యకరణమున సామర్థ్యాతిశయమును యిచ్చుగాక అనియు జెప్పిరి.

పిమ్మట మిసెస్ ఇంద్రసేన్ (పంజాబ్ ఎసోసియేషన్ కార్యదర్శిని) గారు హిందీలో నుపన్యసించుచూ పంజాబునుండి దురవస్థపాలై వలస వచ్చిన స్త్రీల విషయమై శ్రీ మన రాష్ట్రపతి బాగుగ నాలోచించి వారికి సంపూర్ణోపకారము చేతురుగాక ! అని చెప్పిరి.

తరువాత కరతాళ ధ్వనులమధ్య శ్రీ డా॥ పట్టాభి సీతారామయ్యగారు లేచి తమ సహజ గంభీర ధోరణిలో నిట్లుపన్యసించిరి.

" సోదరీమణులారా !

మీరు నాకుచేసిన గౌరవ సన్మానమునకు నేను మీకు కృతజ్ఞుడనగుచున్నాను. నేను నా శక్తికొలది దేశమునకై-అబలల ప్రాబల్యమునకై - పాటుపడెదను. మన సోదరీమణులు హిందూ లా సవరణచట్టమునకై తొందరపడుచున్నారు. కాని ఇప్పటి రాజ్యాంగసభ ప్రజల ఎన్నికల మైనవచ్చినదికాదు. దేశ పరిపాలనా విధానమును నిర్ణయించుటకే యిది ఏర్పడినది. అందువలననే రాజేంద్రప్రసాదుగారు దీనిని రాజ్యాంగ పరిషత్ సభలోపెట్టుటకు సందేహించుచున్నారు. పండిత నెహ్రూగారికి స్త్రీల హక్కు విషయమై చాల సదభిప్రాయ మున్నది. దానిని గురించి వారు ఆగస్టులో ఏదియేని ఏర్పాటు చేయగలరు.

కొందరు స్త్రీలకుండిన కష్టములలో విడాకులచట్టము లేకపోవుట పెద్ద లోపముగానే యున్నది. ఇందులకై ప్రాచీనులు స్త్రీల దురవస్థపోయి వారికి సుఖమొనగూర్చుటకే వ్రతాదులనేర్పాటు చేసియున్నారు. ఇప్పటి పరిస్థితుల ననుసరించి స్త్రీలకు విడాకులచట్టముండుట అవసరమేయగును. కాని అది బ్యాంకిలోని రిజర్వు ఫండ్ వలె నుండవలెగాని, కరెంటు ఎకౌంటుగా నుండరాదు. ఇది మొదటిది.

స్త్రీలకు పురుషులతో సమాన హక్కు ఉండవలయును. కాని ఇప్పటికే భూములు, భిన్నభిన్నములుగా చీలియుండి, వ్యవసాయమునకు అంతగా లాయకు అగుచుండుటలేదు. ఇట్టి దానిలో ఇంకనూ భిన్నాభిన్నములు చేయుట ఉచితమా ? మలబారునందు స్త్రీలకే సంపూర్ణాధికార ముండిననూ దేశకాల పరిస్థితుల ననుసరించి దానిలో మార్పు కలుగుచున్నది.

ఇంకొక్క విషయము. ఇంతకు పూర్వము సమిష్టి కుటుంబములుగా నుండినవానిని వ్యష్టి కుటుంబములుగా చేయుటలో సమైక్యత పోవునని నేను శ్రీ బి. యన్. రావుగారితో పట్టుపట్టుచున్నాను. పురుషులనుండి యుక్తముగా అధికారము లాగుకొనుటకు శాసన సభలలో ప్రవేశించిన పిమ్మట, మీకే శక్తి కలుగును. ఇంగ్లీషు వారు 150 సం॥లకు పైగా మన దేశము నేలిననూ, మితాక్షరి, మయూఖము, దాయభాగము మొదలగు నుత్కృష్ట సాంఘిక ఆచార అంశములను జెప్పెడి హిందూ ధర్మశాస్త్రమును మార్పని గౌరవము వారికే దక్కినది. మనలో సాంఘిక దురాచారములుండిన యెడల వానిని తొలగించుకొనుటకు, ఇంగ్లండు జర్మనీ మొదలగు దేశములలోగల సమాజముల వంటి వాని నేర్పరచుకొని, మనము తొలగించుకొనవచ్చును.

పంజాబీ స్త్రీల కష్టములను గురించి ఒక సోదరీమణి చెప్పియున్నది. నేనందులకై నాశక్తి వంచనలేకుండగా పనిచేయుదును.

నేను, ఉత్కృష్టాశయములతో శ్రీమతి దుర్గాబాయమ్మగారు నెలకొల్పిన యీ ఆంధ్ర మహిళా సభ అత్యుత్కృష్టదశ నొందుగాక ! యని కోరుచున్నాను. ఇచటగల మన ప్రముఖుల సహాయముతో నిది వృద్ధినొందగలదు. దీని అభి

వృద్ధికై నేనుకూడా శక్తివంచన లేక సహాయ పడెదను."

డాక్టరుగారి ఉపన్యాసానంతరము శ్రీమతి ఘుత్తులక్ష్మీరెడ్డిగారు అంత్యోపన్యాస మొస గుచు మన రాష్ట్రపతిగారు మనకై మిగుల పాటుపడెదరని నమ్ముచున్నామనియు, మన రాష్ట్రము తక్కిన రాష్ట్రములకు మార్గదర్శిగా నుండగలదనుటకు శ్రీ కాశేశ్వరరావుగారి "బహు భార్యాత్వ నిషేధబిల్లు" మన రాష్ట్ర శాసన సభలో ప్రవేశపెట్టబడుటయే నిదర్శనమనియు చెప్పిరి.

* * *

## విద్యార్థినుల వీడ్కోలువిందు

19-1-49 తేదీ బుధవారం సాయంకాలము కాశీ హిందూ విశ్వవిద్యాలయ మెట్రికులేషన్, ఇంటర్మీడియట్ పరీక్షలకు హాజరగు సీని యర్ విద్యార్థినులకు జూనియర్ విద్యార్థినులు వీడ్కోలు విందు నిచ్చిరి. ఆ విందునకు సభ తాలూకు అన్ని తరగతుల విద్యార్థినులు, ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు, కార్యవర్గ సభ్యులు హాజరైరి. అల్పాహారముల నంత రము జూనియర్ తరగతి విద్యార్థినుల కార్య దర్శిని చి॥ నిర్మల, సీనియర్ విద్యార్థినీ బృంద మునకు, జూనియర్ తరగతి విద్యార్థినుల తర ఫున వీడ్కోలు అభివందనలను, తెలియజేసె ను. గత రెండు మూడేండ్లనుండి కలిసిమెలసి సోదరీ భావముతో మెలగుచుండినవారికీ ఎడ బాటు సహింపరానిదనియు, వారి సహవాసమున నేర్చుకొన్న క్రమశిక్షణ, అమూల్య ఉద్బోధ నలు,పొందిన అనుభవములు, ఆదరణ, తమకు మార్గము చూపుచుండుననియు, అప్పుడప్పుడు పాఠములందు తమకు కలుగుచుండే సందేహ ముల నివృత్తిచేయుచూ, ఎల్లవేళలా సహాయ పడినందుకు వారికి కృతజ్ఞత తెలియజేసెను. రాబోవు పరీక్షలలో వారు తప్పక ఉత్తీర్ణులు కాగోరుచున్నామనెను.

సీనియర్ విద్యార్థినుల కార్యదర్శిని చి॥ టి. శారద, ఆంధ్ర మహిళా సభలో తమయొక్క స్వానుభవాలు చెప్పుచూ, సభయందు తాము పొందిన క్రమశిక్షణ, విద్యావిధానము తమతమ జీవితములకొక నూతన వెలుగు ఇచ్చినదని, ఇక్కడ విద్యకన్నమిన్నగా నేర్చుకున్న పెద్దల యందు గౌరవము, పిన్నలయందు ప్రేమ, తమ కత్యంతోపయోగముగానున్నదని, జూనియర్ విద్యార్థినులుకూడా అట్టి కట్టుబాట్లను, విధి విధానములను, క్రమశిక్షణను అలవర్చుకొని ఆంధ్ర మహిళాసభ పేరు ఉత్తేజితమగునట్లు చేయమని కోరెను.

ప్రత్యేకముగా శ్రీమతి జమునాబాయమ్మ గారు, శ్రీమతి చన్నఘంటమ్మగారు, తమ యెడ చూపినఆదరణ, ప్రేమ, సౌహార్ద్రత తామెప్పుడు మరువజాలమని చెప్పెను. ఒకవేళ తమయందు ఏమైన తప్పులున్నయెడల మన్నించి పరీక్షలలో ఉత్తీర్ణులగునట్లు ఆశీర్వదించమని కోరెను.

పిమ్మట ఇంటర్మీడియటు సీనియర్ ఇంగ్లీషు ప్రొఫెసరుగారు ఉన్నతోద్యోగమై వెళ్ళు సంద ర్భమున వారిని గౌరవిస్తూ చి॥ బెన్నూరి లీల,

ఇంటర్ తరగతి కార్యదర్శిని, వీడ్కోలు పత్రము చదివి సమర్పించెను.

తరువాత విద్యార్థినులచే 'చా చా' ప్రదర్శనము చేయబడెను. ఆ సందర్భములో శ్రీమతి దుర్గాబాయమ్మగారు మహిళాసభ విద్యార్థినుల ప్రదర్శనా కౌశలమును గొనియాడి, లోగడ యీ సంస్థనుండి విశ్వవిద్యాలయ పరీక్షలకు వెళ్ళి ఉత్తీర్ణులైనవారిలో చాలమంది నేడు ఉన్న తోద్యోగములందు ఉన్నారనియు, వారు సభ యొక్క ఆదర్శములకు విద్యావిధాన సౌష్టవమునకూ చిహ్నములనియు, వారి అడుగుజాడలలోనే తక్కినవారుకూడా అనుసరించి వారివారి జీవితములను చక్కబరచుకొనుటేగాక, ఆంధ్ర మహిళాసభ పేరును నిలుపగలరని నమ్ముచున్నాననిరి.

శ్రీమతి మంత్రిప్రగడ రంగనాయకమ్మగారి అభివందనములతో "జన గణ మన" గీతముతో సభ ముగిసెను.





# ప్రజాసేవ

ఏకాంకిక



శ్రీమతి బెండపూడి వెంకటసుబ్బమ్మగారు



: పాత్రలు :

| | | |
|---|---|---|
| బాలాంబ | — | 24 సంవత్సరాలజవ్వని, ప్రతాపరెడ్డిగారి మేన కోడలు, తల్లిదండ్రులు లేని పిల్ల. |
| సుందరి | — | ప్రతాపరెడ్డిగారి భార్య. |
| ప్రతాపరెడ్డి | — | కొండవీటిరాజు. |
| జయంతి | — | చెలికత్తె. |



## 1 వ రంగము

[మన కథా కాలానికి ఆరేండ్లనాడు ఒక రోజున, బాలాంబ తన మామగారును, కొండవీటి రాజును అయిన ప్రతాపరెడ్డి కొలువుకూటంలో సభ చేసివుండగా, వ్రాయసకాడైన పోతనరెడ్డిని చూచి ప్రేమించుతుంది. అతనితో మాట్లాడాలని ప్రయత్నం చేస్తుంది. కొలువు చాలించిన తర్వాత పోతనరెడ్డి తన యింటికి పోతుంటాడు. చెరువు గట్టుకు రాగానే]

బాలాంబ: (వెనుకనుండి) రెడ్డిగారూ! నమస్కార శతంబులు.

పో: ఎవరూ? బాలాంబా, ఏమి బాలా! విశేషమేమి, దూరాగమనంచే ప్రయాసచెందినట్లున్నావు. కొంచెం విశ్రాంతి తీసుకొని మాట్లాడు.

బా: విశ్రాంతికేమిగాని మీరు కొలువులో చేరి యెన్నాళ్లయింది?

పో: నాలుగు నెలలయింది.

బా: మీకు వ్రాతపనిలో విసుగుపుట్టదూ! విసుగంటూ లేకుండా వ్రాస్తారు. గొప్ప కవీశ్వరుడికన్నా తీరుబాటుంటుంది కాని మీకు లేదే?

పో: రాచకార్యం కదూ చాలా శ్రమని యెంచుకోకూడదు.

బా: మీ ఓపిక అందరికీ వుండదు. మీ వ్రాత పనిలో నన్నుకూడా సాయపడమంటారా?

పో: బాలా! ఏమిటీ నా చెవులను నేనే నమ్మలేకుండ వున్నాను. రాజాంతఃపుర స్త్రీవి, విశేషించి రాజుగారి....

బా: మరేం ఫర్వాలేదుగాని నా సహాయం అవసరమైనపుడు, తప్పక కబురుచేయండి. సందేహించకండి.

(నిష్క్రమించును)

## 2 వ రంగము

[ఆరు సంవత్సరాల తదనంతరం.]

బా: నా ఆటదోయం పడింది.

జ: దోయం అంటే ఎంత?

బా: పదకొండు.

జ: యింకేం మరోపందెం వేయి. యీ పర్యాయం తప్పక నీ పావుపండి తీరుతుంది. నీ అదృష్టరేఖ బాగుందిలేమ్మా.

బా: నా కేమేమో అత్త సుందరీదేవిగారి దయవల్ల మాతాపితృ వియోగ దుఃఖము నా దరి జేరకుండ పోయింది.

సుం: ఎంత మాట! నే నెంతదానను అంతా ఈశ్వరేచ్ఛ. జయంతీ! ఆటలో బాలయే గెలిచింది. దాని కేమమ్మా అదృష్టవంతురాలు!

## 3 వ రంగము

సుం: జయంతీ! మాతాపితలు లేని బాలకు నేనే పోషణకర్తనుకాన వివాహ విషయంలో నేనే తగు శ్రద్ధ తీసుకొంటానని మహారాజుగారికి చెప్పాను. వారు 'సరే'నన్నారు. దాని సౌందర్యగుణాతిశయాలు చూస్తే నా కెక్కడాలేని ఆవేదనగా వుంటుందే.

జయం: అమ్మా సౌందర్యగుణాదులు భగవత్ప్రసాదితాలు. వాటిని గురించి మీ కెందుకమ్మ యీ ప్రాకులాట, యీ యీర్ష్యానూ, సౌందర్యమనేది పుట్టుకతో నే రావాలి కాని మీకీ శ్రమ యెందుకమ్మా?

సుం: శ్రమకాదే, కొండవీటి రాజ్య సింహాసన్నాని అలంకరిస్తున్న నాకా దానికా యీ సౌందర్యమంతా వుండాలి?

జ: (భయపడి వణుకుతూ) మరేనమ్మా, దిక్కూ మొక్కూ లేకుండా పరాయి పంచల్లోపడి ప్రాకులాడుతుండే దాని కెందుకమ్మా యీ మహారాణి లక్షణాలు.

సుం: బాగా చెప్పావే జయంతీ, అందుకే నా కసి తీరేటట్లు, మహారాజుగారి కేదో నచ్చ చెప్పి దీనికొక సర్వ భ్రష్టుణ్ణి తీసుకొచ్చి అంటగట్టాలి.

జ: దాని కింత దీర్ఘాలోచన ఎందు కమ్మా! మహారాజుగారి కొలువులో క్రొత్తగా చేరి వుంటున్నాడే వ్రాయసకాడు, ఆ పుట్టుదరిద్రుడు, పోతనరెడ్డి కిస్తే సరిపోదూ?

సుం: నిజమే జయంతీ. ఇదే నిశ్చయం: "తిండి లేని పోతన్న దిక్కులేని బాలమ్మకు మగడు"

[వివాహం అయింది. మేనకోడలు బాలాంబకు పాలకోటను అరణ మిచ్చాడు ప్రతాపరెడ్డి. పాలకోటలో పోతనరెడ్డి బాలాంబతో కాపురం చేస్తూ ప్రతాపరెడ్డికి కప్పం కట్టున్నాడు.]

## 4 వ రంగము

[పాలకోట పైభాగాన బాలాంబ, తన చెలికత్తె వసంతతో ప్రవేశం.]

బాలా: చెలీ వసంతా, విన్నావా యీ ఘోర వార్త. నాకు నిజంగా మతి భ్రమించుచున్నది. మా మామ నిజంగా యింత భార్యావిధేయుడయ్యాడేమిటే! ఇంత కఠోరమైన ఆజ్ఞ నిచ్చుటకు అతని చేతులెట్లాడెను! తాను యేవిషయముచే యిట్టి విచారకర నిర్ణయా

నికి వచ్చాడు? ఆహా! స్త్రీబుద్ధి ప్రళయాంతకమన్న సామెత వృధ గాలేదు కదా!

వసంత : ఏమమ్మా, యీ ఆందోళనకు కారణము? విషయం వ్యక్తం కానీయకనే విచారిస్తారెందులకు ?

బా : చూడవే యీ వుత్తరం! మహారాజు ప్రతాపరెడ్డిగారు పంపిన ఆజ్ఞ!

వ : ఏదీ ? (తీసి చదువును)

సామంతుడును, ప్రియమిత్రుడును అయిన పోతనరెడ్డిని రాజు ప్రతాపరెడ్డి దీవించి వ్రాయునదేమనగా:

మీ రాజ్యంలోని పాలకోట గ్రామవాసులు, రాజద్రోహులై మాపై కత్తిగట్టుటకై మీ పరోక్షమున ప్రయత్నములు చేయుచున్నారనియును, మీరింకనూ అజాగ్రతగనే యున్నారనియు మాకు రూఢి వర్తమానములు చేరినవి. కావున మీ కిపుడు పంపు నాజ్ఞ యేమనగా, నేను పంపు రెండు వందల సైనికుల సహాయము తీసుకొని, అర్ధరాత్రగు సరికి పాలకోట గ్రామమునంతయు ముట్టడించి సదరు గ్రామవాసులను, వారివారి యిండ్లలోనే స్త్రీ బాలవృద్ధులను విచక్షణలేకుండా చిత్రవధ జరిగించవలసినది. ఈ వుత్తర్వు నతి గూఢముగ వుంచి పని ముగించవలయును. ఇది రాజాజ్ఞ!

ఇట్లు
రాజు ప్రతాపరెడ్డి.

అమ్మయ్యో! యిదేం శాసనం. యిలాంటి ఘోరపుటుత్తర్వును చూచేనా మీరు కలవరపాటు చెందడం. అయినా అంతటి మహారాజుకే మమ్మా యింత కఠినపుగుండె? ఆయన్ని అందరూ కరుణాళుడంటారే!

బాల : అదీ ఆశ్చర్యంగావుంది. నా ప్రజలను యిన్నాళ్లదాకా (కళ్ల నీళ్లు ఆపుకోలేకపోయింది) నా కన్న బిడ్డల్లాగా చూస్తున్నాను. నా భర్తగారు విచారపడుతూ రాజాజ్ఞను పాలించడానికే నిశ్చయించుకున్నారు. నిష్కారణంగా యిందరి ప్రాణాలను బలిగొనడంలో అర్థమేముంది. అయినా నేనే సాహసంతో యెదిరిస్తాను.

[దాసి చెవిలో యేమో చెప్పి క్రిందకు పోయి సైనికాధికారి వేషంలో తిరిగి కోట బురుజుమీద నిలబడి గ్రామంలోని ప్రజలలోని మార్పులను గమనిస్తూ వుంటుంది. అంతలో గ్రామంలో నుండి ఒక సన్నని వెలుంగు వినబడుతుంది]

ప్రజల్లారా! మీ రాణియైన బాలాంబగారిపై, మీకేమైనా ప్రేమ, విశ్వాసాలుంటే యీరాత్రి జాముప్రొద్దెక్కులోపల ప్రశాంతంగా యీ గ్రామాల్ని వదలిపెట్టి పొండి. మరల రాణీవారి ఆజ్ఞయైనపుడు రావచ్చును. ఇదే వారి శాసనం. ఇదే వారి రాజముద్రిత—

వసంత : (రొజుకుంటూవచ్చి)

అమ్మా తమ ఆజ్ఞ నిర్వహించాను—

(తెర)

## 5 వ రంగము

ప్రతా : (స్వగతం) ఆహా, బాలాంబా, నీ నేర్పరితనము ముందు నీ అత్తగారి నీచపుటాలోచనలు నిర్జీవములైపోయినవి! కాకున్న నేనెంత యవివేకిని, మందమతిని. ఎంత భార్యా వ్యామోహమున్నను రాచకార్యాలలో, దురభిమానియైన ఆడుదాని ఆలోచనలకు తావెందుకీయవలెను. ఆ బాలాంబయే సమయానికి లేకున్న నా ప్రజలు యెంత బాధ పడేవారో, యెంత ఘోర కలి జరిగివుండేదో? అబ్బా! ఆ భయానకదృశ్యము తలుచుకొంటేనే ఒడలు జలదరించుచున్నది.

(ప్రకాశంగా) మంత్రిగారూ మొన్న చేయించిన మణి కిరీటాన్ని బాలాంబకు బహుమానంగా మేము పంపినట్లుగా వ్రాసి పంపుడు.

(తెర)

## 6 వ రంగము

[పాలకోట రాజ్యంలో వర్షాలు లేక సస్యాలు లేవు. కాటకం వచ్చింది. ప్రజలు నానా యిబ్బందులు పడుతున్నారు. ఆకలి బాధకు తోడు అంటు రోగాలుకూడా అలముకున్నాయి.]

బాలా : నా ప్రజల్లారా ! మీకు సరిగ్గా తిండి కూడా పెట్టలేని స్థితిలో వున్నాను. భగవానుడు చిన్నచూపు చూస్తున్నాడు. రాజుగారి కప్పమెట్లు చెల్లించాలో తోచడం లేదు. ఏమండీ కప్పం తగ్గింపు విన్నపానికి యేమైనా సమాధానం వచ్చిందా.

పోతన : సంజాయిషీరాకేం. సంజాయిషీలూ వచ్చినయి. కప్పం యీయేడు మూడువంతులు హెచ్చుచేశామనీ, వారంరోజుల్లో యావత్తు కప్పం ఖజానాలో చెల్లింపబడాలనీ రాజాజ్ఞ.

బా : అబ్బా, సుందరీదేవీ ! యెంత అసాధ్యురాలవమ్మా? నామీది ఈర్ష్యకు నా అమాయిక ప్రజలా ఆహుతికావడం? యీ కరువు రోజుల్లో నా ప్రజలు కరువుతోను అంటు వ్యాధుల్తోనూ వారి సంసారాల్నే పోషించుకోలేని స్థితిలోవుంటే మూడురెట్ల పన్నును యేమొహం పెట్టుకొని వసూలుచేస్తామండీ. నా ప్రాణంపోయినా యిటువంటి ఘోర కలి నా రాజ్యంలో జరుగనీయను. ఎందుకలా విచారిస్తారు. వుండండి నేను ప్రయత్నించుతాను. అంతా ఈశ్వరేచ్ఛ.

## 7 వ రంగము

[ప్రతాపరుద్రుని కొల్వు]

ప్ర : మంత్రీ! పాలకోటనుండి సమాచార మేమైనా వచ్చిందీ? నేను ఆ వుత్తర్వులు పంపించినప్పటినుండి నాకేమీ పాలుపోవడంలేదు. సుందరీదేవి ఈర్ష్యాగ్నికి నేనుకూడా మ్రగ్గిపోతున్నాను.

మం : చిత్తం. యిప్పుడే వారిదగ్గరనుంచి జాబు వచ్చింది. తమ సెలవైతే.... ....

ప్ర : మంచిది. వినిపింపుము.

మం : (ప్రకాశంగా)

మహారాజులును, పితృసమానులును, మామగారును అయిన ప్రతాపరెడ్డిగారికి శతాధిక వందనములు.

నా రాజ్యంలో ప్రజలు కాటకంతో నేగాకుండా అంటు రోగాల్తోకూడా బాధపడుతూ వారి కుటుంబ భారమే వారు మోయలేక చిక్కి శల్యాలై వున్నారు. వైద్యసహాయం అందరికీ సకాలంలో అందని కారణం చేత మృత్యువును ఆహ్వానించుతూ మృత్యు పరిసరాల్లో నివసించుతున్నారు. ఈ స్థితిలో తమ కఠోర శాసనంవారిని మరింత భీతావహుల చేసింది. ఈ నిర్భాగ్య జీవి మీద కక్షుసాధించడానికై నా అమాయిక బీద ప్రజలను హింసించవద్దు. అందుకు యీ హృదయము సహించలేదు. ఆ ఘోరకలిని చూచి సహించుటకు నా హృదయం పాషాణ సమానం కాదు. ఇది మీ స్వబుద్ధి జనితము కాదనుకుంటాను. ఆపదలో నున్న ప్రజల కష్టాలు పోగొట్టి భయారహితుల చేయనిరాజువుండిననేమి ? మండిననేమి ? కనుక మా కప్పములకు బదులుగా, మీ బహుమానమైన మణికిరీటమును, నా ప్రాణమును మీకు పంపుచున్నాను. ఈ జాబు వెంట కిరీటం పంపాను. ఈ జాబు మీకు చేరు సరికి నా బొందిన ప్రాణాలుండవు. నేనింక బ్రతికి నా ప్రజల బాధలు హెచ్చించను. సెలవు—

ప్ర : హా బాలా !

[మూర్ఛిల్లును]

స మా ప్త ము

★

# ఆమె

•••o○o•••

శ్రీమతి రాజ్యలక్ష్మీదేవిగారు రచించిన ఈ గేయంలో తీవ్రమైన భావనా శక్తి కనిపిస్తోంది. ఆవిడ చూపిన "ఆమె" యొక్క చిత్రం నిరాశాజనకమైనది.

కవులు "ప్రభావతి"నీ "వరూధిని"నీ వర్ణించారు. కాని "ఆమె" యొక్క నిజరూపంలో అవేవీ కనిపించవు. "కాకుల కూత, బిడ్డల మోత, భర్తగారి కోరచూపు, అత్తగారి ఓరచూపు, చక్కగ ముస్తాబు,..." ఇవన్నీ నిత్యజీవితంలోని రుచిలేని నిజాలు. కవులు వర్ణించినదేదీ వాటిలో లేదు.

చివరికి "అమ్మమ్మో, బామ్మో, అత్తో, ముత్తవ్వో" "కాలగర్భం"లో కలిసిపోతుంది.

అయితే యిది "ఆమె"ని గూర్చిన సత్యం మాత్రంమే కాదు. "అతడి"కైనా "కాకులకూత" తో లేవడం, "కాలగర్భం"లో కలవడం తప్పదు. వెనుకటి ఒక బొగ్గులమ్మేకుర్సే అమ్మి అందిట "There's no happiness in this world, so you must be happy without it" అని.—

ఇటువంటి అనుభూతి మహిళలలో కలగడం అభినందనీయం. అది ఒక జాగృతిని సూచిస్తుంది.

---

కలంలో

❊ ❊ ❊

" చంద్రవదనము,
చంపక నాసిక,
కలువలు కన్నులు,
కంబుకంఠము,
చెక్కుటద్దములు,
సింహమధ్యము,
మధురాధరము,
మన్మథ బాణము,
బంగారురంగు,
పొంగిన యౌవనం...."

" బంభర వేణి....
రంభ....ఊర్వశి...."
" అమృతమూర్తి,
ఆరాధ్య దేవి,
మాతృదేవత
మహా పతివ్రత
శక్తిరూపిణి,
సహధర్మచారిణి,
ఆనందదాయిని,
అదృష్టశాలిని,
భుక్తికి, భక్తికి,
ముక్తికి, శక్తికి,
నిలయం...."

# ఆమె

కాలంలో

* * *

అయ్యగారు బి. ఏ.,
అరవై రూ॥ జీతం.
ఆరేండ్లు కాపరం,
ఆరుమంది అపత్యాలు.
ఇరుకు యిల్లు,
మొరకు పొరుగు,
రేషను బియ్యం,
పోషణ శూన్యం

* * *

కాకుల కూత
చీపురు చేత.
కాఫీ, ఉప్మా,
కాగుతో నీళ్లు

* * *

స్కూలుకు బిడ్డ,
పాలకు బిడ్డ,
ఆటకు బిడ్డ,
మాటకు బిడ్డ,
మందుకు బిడ్డ.

ఆఫీసుకు వేళ
అయ్యగారి భోజనం,
'వంటకాలు బాగులేవు'
వల వల వల ఏడ్పు.
అత్తకు మడి,
ఆడబడుచు దాడి,
ఆ పిమ్మట భోజనం,
అస్సురుస్సు జీవితం.

* * *

పీటచప్పుడు,
చేట చప్పుడు,
పక్కయింటి కోడలితో,
పక పక పక నవ్వు
అత్త ఓరచూపు,
భర్త కోరచూపు.
అయ్యగారి రాక,
క్లబ్బుకి పోక,
పొయ్యిలో నిప్పు,
ఇడ్డెను పప్పు,
చక్కగా ముస్తాబు....
"....................."

అల్లుడు వస్తే అన్నీ చేసి,
కోడలు వస్తే కొరకొర లాడి,
అమ్మమ్మో, బామ్మో,
అత్తో, ముత్తవ్వ
మనుమల మొట్టుల కోర్చి,

కోడలి బాధకు క్రుంగి
ఉపవాసాలతో, ఉప్పుపిండితో,
ఆచారాలతో, అటమటలాడీ,
ఆపేక్షలకల్లంత దూరమై,
అష్టకష్టముల కాలవాలమై,
విసిగి, విసిగి, విసిగించి, వేసారి,
కన్నూ కాలూ వెన్నూ వంగి,
చావును కోరి, తావేలేక,
కట్టకడకు ఎట్లో కడ తేరి,
కాలగర్భములో కలిసింది.

—శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మీదేవిగారు



చర్చనీయమైన

# ధార్ కమిటీ నివేదిక

రాజ్యాంగ పరిషత్ అధ్యక్షునిచే నియమింపబడిన భాషా ప్రయుక్తరాష్ట్ర పరిశీలన సంఘము, ప్రస్తుతము భాషారాష్ట్ర నిర్మాణము ఆపుచేయమని, సంస్థానాలు పూర్తిగా పరిసర రాష్ట్రములలో లీనమైనప్పుడు, పరిపాలనా విధానమున కనువగునట్లు, కొన్ని రాష్ట్రముల నేర్పాటు చేసికొన వచ్చునని సిఫార్సు చేసినది.

భాషాప్రయుక్తముగా దేశమును పునర్విభజించ వలెననే ఆందోళన చాల కాలమునుండి జనసామాన్యములో తీవ్రముగా నున్నదనియు, అది నిర్మలమైన కోర్కెఅనీ, అది సఫలీకృతము కానియెడల ప్రజలలో ఎంతో ఆశాభంగము కలుగుననీ, కమీషన్ వారు అభిప్రాయ పడుచున్నారు. అయినప్పటికీ దేశమునందేర్పడిన క్లిష్టపరిస్థితులనుబట్టి ప్రస్తుతమునకు యీ సమస్య తేల్చనక్కరలేదని అందులో తెలిపిరి.

"ఇండియాను బలవత్తరమైన ఒక జాతిగా తయారు చేయుటే మన ప్రథమ కర్తవ్యము. నేడు రచియింపబడుచున్న రాజ్యాంగ విధానము, వెంటనే పరిష్కరించవలసిన క్లిష్ట సమస్యలుకూడా యీ దృష్ట్యానే సవరించుకోవాలి. జాతీయతా నిర్మాణమునకు దోహదంచేసే పనులనే ముందు చేయుటకు పూనుకోవాలి. జాతీయతకు అవరోధము కల్పించు వాటిని నిరోధించడమో, నిల్పియుంచడమో చేయాలి. ఈ సూత్రమును భాషా రాష్ట్ర విషయములో ప్రయోగించి చూచిన మాకు భాషారాష్ట్ర నిర్మాణము ఉపయుక్తముకాదని తోచినది. ఒకసారి భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణమున కంగీకరించితిమా, దేశమునంతనూ భిన్నాభిన్నము చేయుటకుపకరించును" అని తేల్చిరి.

## కమీషన్ నియామకం :

1947 నవంబరు నెలలో రాజ్యాంగ సభయందు జరిగిన చర్చ ఫలితంగా, రాజ్యాంగ రచనా సంఘ సూచనపై యీ భాషాప్రయుక్త రాష్ట్ర విచారణ కమిటీ నియమింపబడినది. ఈ కమిటీకి శ్రీ యస్. కె. ధార్ (లోగడ అలహాబాదు హైకోర్టుజడ్జీ) అధ్యక్షుడు. కమీషన్‌లోని మిగతాసభ్యులు డా॥ పన్నాలాల్, శ్రీ జగత్ నారాయణలాల్, శ్రీ బి. సి. బెనర్జీ (సెక్రటరీ). వివిధ భాషాప్రాంతములనుండి యీక్రింది వారు, సాక్ష్య సేకరణలోనూ, కార్య క్రమములోనూ, వీరికి తోడ్పడుటకు చేర్చుకొనబడిరి. శ్రీ రామకృష్ణరాజు, శ్రీ టి. ఎ. రామలింగ చెట్టియార్, శ్రీ నారాయణ మీనన్, శ్రీ టి. సుబ్రహ్మణ్యం, కె. యమ్. మున్షీ, శ్రీ ఆర్. ఆర్. దివాకర్, శ్రీ హెచ్. వి. పటాస్కర్, శ్రీ గోపీలాల్, శ్రీవత్సవాగార్లు. ఈ సంఘం జూలై 19 వ తేదీని పనిని ప్రారంభించి, ఆంధ్ర, తమిళ, కేరళ, కర్నాటక, మహారాష్ట్ర, కొంకణ, మధ్యబీహారు రాష్ట్రములలో పర్యటించి, 6,700 లకు పైబడిన సాక్ష్యులను విచారించి, వెయ్యి లిఖిత విజ్ఞాపనలనందుకొని, చివరిసారి నవంబరు 21 న సంఘసభ్యులు సమావేశమై తమ ఏకగ్రీవాభిప్రాయమును యీ క్రింది నివేదికద్వారా డిసెంబరు 10 న రాజ్యాంగ పరిషత్తున కందజేసిరి.

## నివేదిక విషయాలు :

ఆంధ్ర, కర్నాటక, కేరళ, మహా రాష్ట్రముల ప్రశక్తి తెస్తూ, కాంగ్రెసు 1921 సం॥ నుండీ భాషారాష్ట్ర పునర్నిర్మాణమునకై కట్టుబడి యున్నప్పటికీ, నాటి పరిస్థితులకూ, నేటి పరిస్థితులకు చాల వ్యత్యాసమున్నదనీ, దేశ పరిస్థితుల కనుకూలమైనంతవరకే వాగ్దానములను చెల్లించుకొన వీలుండునని నివేదిక పేర్కొన్నది. ఒక భాషా రాష్ట్రము నేర్పాటు చేసేముందు, భౌగోళిక సుస్థిరత, ఆర్థిక స్వయం సమృద్ధత, భావిపురోభి వృద్ధినొందగల అవకాశములు, ప్రజాంగీకారము కలిగి ఉండాలి.

భాషారాష్ట్ర నిర్మాణ వాంఛ రెండు ముఖ్య విషయములపై నాధారపడుచున్నది. (1) ఆయా భాషలు మాట్లాడు వారు వేరువేరు 'ఉపజాతు'లనీ, ఏకైక కేంద్ర ప్రభుత్వము అట్టి 'ఉపజాతుల' అంగీకారము మీదనే ఏర్పడి, సంతుష్టములైన వివిధ రాష్ట్ర విభాగములనుండి అధికారమునొంది

బలవత్తరము కాగలదనియూ, (2) నేటి రాష్ట్రములు పరిపాలనా సౌకర్యమున కలవికానంత పెద్దవిగానుండి, వివిధ భాషావర్గ సంకలితముగా నుండుటచే, ముఖ్యముగా విద్యా, శాసన సభల విషయములందు చిక్కులేర్పడుచున్నవనీ చెప్పబడుచున్నది.

భాషాప్రయుక్తరాష్ట్రాలు ఏర్పడినట్లైన, అల్పసంఖ్యాకులైన భాషావర్గము వారిపట్ల అసహనం ప్రబలుతుందనీ, దేశభక్తి సంకుచితమగుననీ, సరిహద్దుల విషయములలో - ముఖ్యముగా మద్రాసు, బొంబాయి నగర విషయములలో-వైషమ్యాలు ప్రబలుతాయనీ, భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణ వ్యతిరేకుల వాదన.

మరికొందరు తక్షణమే ప్రజల మనస్సులందు గాఢముగా నాటుకొనియున్న యీవాంఛ యీడేర్చనట్లైన, విద్వేషము, అవిశ్వాసము, అసంతృప్తి ప్రబలుతుందనీ తత్పర్యవసానముగా దేశములో నిర్మాణ కార్యక్రమము కుంటుపడుతుందని తెలియజేసారు.

దేశం యింకా బహిర్గత విపత్తులనుండి వెలువడలేదనీ, ప్రస్తుతం ఆర్థిక మహాసంక్షోభమునుండి తేరుకోలేదనీ, స్వదేశసంస్థానాలు ఇండియన్ యూనియన్‌లో అంతర్భాగములుగా మారుట పూర్తికాలేదనీ, ప్రభుత్వము నెదుర్కొన్న కఠిన సమస్యలు యింకా పరిష్కరించ బడలేదనీ, యీ పరిస్థితులలో దేశము భాషాప్రాంతములుగా విభజింపబడి అట్లు నూతనముగా ఏర్పడబోవు భాగములవలన కలుగు ఆర్థిక పరిపాలనా భారములను వహించలేదనీ, కొందరు అభిప్రాయమునిచ్చిరి.

### సరిహద్దు సమస్యలు :

తరువరి నాల్గు భాషా రాష్ట్రముల గూర్చి నివేదిక వివరిస్తూ, వీటి సరిహద్దు ప్రాంతములు ఒకే భాషకు చెందిన ప్రాంతములు గాక, రెండేసి భాషలకు చెందియుండుటవలన విభజనలో కొన్ని చిక్కులేర్పడును.

మలబారు జిల్లాను ప్రత్యేక రాష్ట్రముగా చేయుటకు సాధ్యముకాదు. అయితే తిరువాన్కూరు, కొచ్చిన్‌లను చేర్చినట్లైన సాధ్యమగును. అటులనే మైసూరును చేర్చి కర్ణాటక రాష్ట్రమును చేసిన బాగుగనుండుటేగాక సముద్ర మార్గము కూడ లభ్యమగును. మహారాష్ట్రమునకై వాంఛ కొలదికాలము క్రిందటనే తలఎత్తుటచే మధ్య, బీరారు రాష్ట్రములలోని ఆ భాషావర్గమువారి అభిప్రాయము ధృఢము కాలేదు.

### బొంబాయి, మదరాసులు :

ఈ రెండు నగరముల విషయము వేరే సెక్షన్‌లో వివరిస్తూ యిట్లు పేరొన్నది :

ఈ రెండు నగరములలో ఒకే భాషకు చెందిన వారు మాత్రమే నివసించుటలేదు. ఒక భాష మాట్లాడే వారైనా అధిక సంఖ్యాకులుగాలేరని మా అభిప్రాయము. వీటియందు అనేక భాషలు మాట్లాడువారున్నారు. సమిష్టి జీవనమును పెంపొందించుకొనుచూ వృద్ధినొందుచున్న యీ నగరములు ఏ ఒక్క భాషా ప్రాంతమునకు చెందకుండా వాటి శ్రేయస్సుకు, యావద్భారత ప్రయోజనం కొరకు విడిగా నుంచుట ముఖ్యము.

### ఆర్థిక విషయములు :

నాల్గవ ప్రకరణములో భాషా రాష్ట్ర నిర్మాణము వలన ఎట్టి ఆర్థిక పరిపాలనా ఫలితములు కలుగునో చర్చించబడినది.

నూతనముగా సృష్టింపబడు ఆరు రాష్ట్రముల ప్రభుత్వ, పరిపాలనా యంత్రములను నిర్మించుటకు, ముఖ్యనగర నిర్మాణములకు, చాలా ధనము వ్యయమగును. ఒకమూల కాందిశీకుల వసతి చేకూర్చుటకు యిబ్బంది పడుచుండే యీ సమయమున అనవసర ధన వ్యయము చేయుట మంచిది కాదు. దీనివలన అధిక పన్నులు విధించవలసి వచ్చును. మరియొక అల్పసంఖ్యాకుల సమస్య ఏర్పడగలదు. సరిహద్దు సమస్య కొంత వైషమ్యము ప్రబలచేయగలదు. నూతనముగా నిర్మించే రాష్ట్రములన్నీ ఆర్థికముగా తరుగుగల రాష్ట్రములే. కొన్నింటిలో ఎక్కువ, మరికొన్నింటిలో తక్కువ తరుగు ఏర్పడుతుంది. ఏ ఒక్క రాష్ట్రముకూడా పోలీసు రాష్ట్రముకన్న ఉత్తమంగా పని చేయలేదు. మూడవ ప్రకరణములో ప్రతి రాష్ట్రము యొక్క ఆర్థికపరిస్థితి చర్చించబడినది.

---

(38-వ పేజీ చూడుడు)

# అభిసారిక

శ్రీమతి ఎ. పేరిం కుమారిగారు

అది శ్రావణబహుళ అమావాస్య. ఆకాశమంతా మేఘావృతమయింది. కన్ను చించుకొన్నా కనుపించని కారు చీకటి లోకాన్నంతా కప్పింది. వాయువు ప్రచండగతిని వీచడం ప్రారంభించింది. మధురానగరి దీపికలన్నీ వాయుదేవుని పాదాక్రాంతులవుతున్నాయ్....ప్రకృతే గర్జిస్తే ఆఘాటికి ఓర్వగల శక్తి మానవునకే లేదేమో!...

కోటగోడ నీడలో చలిచే ఒణకే దేహాన్ని ముడుచుకొని నిద్రిస్తున్నాడు ఉపగుప్తుడు. అతడొక పరివ్రాజకుడు. దేశద్రిమ్మరి.

హఠాత్తుగా ఏదో పాదం అతని శిరస్సుకు తగిలింది. అందెల ధ్వని చెవివద్ద ప్రతిధ్వనిస్తోంది. ఉలిక్కిపడి లేచి చూచాడు ఉపగుప్తుడు.

తేజోవంతమైన ఆయన నేత్రాలు ఎదుటనున్న వాసవదత్తపై పడ్డాయ్. వాసవి మధురానగరిలో ప్రఖ్యాత నర్తకి. నిండు యవ్వనంతో తొణికసలాడే ఆమె శరీర లావణ్యం దేహాన్ని కప్పిన పాము కుబుసములాంటి చీనాంబరం లోంచి తొంగి చూస్తోంది. తీర్చి దిద్దిన తిలకం ఆమె వదనారవిందానికి వింతకాంతి నిచ్చింది. మదనోత్తేజకమైన చూపుల బరపుతూ నానావిధాభరణాలంకృతయై ప్రియుని కలసికొనడానికై పోతూంది. ఆ తరుణి పరివ్రాజకుని సుందర వదనంలో పారలౌకిక శాంతి కాంతులను గాంచింది. ముందునకు వంగి ఆతని హస్తాన్ని తన చేతితో స్పృశిస్తు "క్షమించండి! చీకటిలో నా కాలు మీ శిరోభాగానికి తగిలింది. మీకీ కటికగాలిపై నిదుర తగదు. మా గృహానికేతెంచి సుఖ తల్పం మీద శయనించి నా గృహాం పావనం చెయ్యండి" అంది లజ్జాపూరితవదనయై.

పరివ్రాజకుడు చిరునవ్వు నవ్వి "సుందరీ! నీ ఆహ్వానానికి కృతజ్ఞుడను. కాని తగిన సమయమింకా ఆసన్నంకాలేదు. సమయము రాగానే తప్పకుండా వస్తాను. నీ దారిని పోయి పని చూచుకో" అన్నాడు.

ప్రకృతి ఘీంకరించింది. మెఱుపు తీవెల సాయంతో వాసవదత్త నిజప్రియ సందర్శనానికై చనుదెంచింది.

*　　　*　　　*

సంవత్సరం అయింది, వసంత సంధ్యాకాలం. నగరంలోని నగారాలు ప్రతిధ్వనిస్తున్నాయ్! కోకిల కూహు కూహు నాదాలు, నెమళ్ళ నాట్యాలు ఋతురాజుకు శోభను తెస్తున్నాయ్. ఆనాడు నగర వాసులందరూ పుష్పోత్సవానికని ఆ రామసీమలకు వెళ్ళారు ఊరి వెలుపలకు. తూర్పున చంద్రోదయం ప్రారంభించింది. పశ్చిమాన్ని వివిధవర్ణాలతో మనోహరంగా సూర్యాస్తమయం. మందమలయ మారుతాలు పూల

రవీంద్రుని అనుసరించి

తోటలనుండి రాజమందిరాలలో ప్రవేసిస్తు న్నాయ్!

సన్యాసి ఉపగుప్తుడు నగర బాహ్యానికి వెళ్ళాడు. అది భగవన్నియుక్త సంకేత రాత్రి కాబోలు!

అది మాలపల్లె. ఇండ్లు కొద్దిగా ఉన్నాయ్ చుట్టూ మురికి కాలవల కందకాలతో ఓపాడు గృహంలో ఒక చాపమీద వాసవదత్త పడి ఉంది. శరీర లావణ్యం నశించి రోగ భూయిష్ట దుర్గంధ భరితమయింది. బంధుగులు, ప్రియులు ధన సౌందర్యాల వెనక వెంబడిచారు. వాడిన పువ్వును పూజించే మూర్ఖుడెవరూ!

ఉపగుప్తుడు దగ్గరగావెళ్ళి ఆమె శిరస్సును తన తొడపైకి తీసికొని ఉద్ధరిణితో జారీలోని నీరు పోసాడు. అతని నయనాల్లోని కారుణ్య రేఖలు ఆమె వదనం మీాద ప్రతిబింబిస్తున్నాయి. మహాత్ముల స్పర్శవల్లే పాపాలు పటాపంచలవు తాయ్. ఆమెకు శాంతి లభించింది. మెల్లగా కన్నులు విప్పి మూల్గుతూనే "నా బాధలనుండి రక్షించిన ఈ ఉదారహృదయులెవరూ? నేనంత నోచుకొన్నానా!"

సహజ స్నేహాపూరిత స్వరంతో "నేనూ పరివ్రాజకుడను, వాసవదత్తా! సమయమరు దెంచిందని ఏతెంచాను." అన్నాడు ఉప గుప్తుడు.

ఆమె కనులు బాష్పపూరితాలయ్యాయి. కోయిల పంచమ స్వరంతో ఆలాపిస్తోంది ప్రకృతి గీతాల్ని.



# సంక్రాంతి లక్ష్మి



హేమంత ఋతురాజు హేలాగతిఁ జూచి
    జనులెల్ల చలితోడఁ సందడింప
తూర్పు కెంజాయ సొంపులు దిద్ది తీర్చుచు
    పద్మబాంధవుఁ డదే బయలు దేర
బాలిక లెల్లెడ ప్రాంగణంబుల రంగ
    వల్లుల, గొబ్బి పూజల నొనర్ప
క్రొత్త యల్లుండ్రను గొనివచ్చు వేడుక
    నత్తవారిండ్ల సందడి వహింప
    దేవళంబుల మేళముల్ తేజరిల్ల
    పంటలతొ పచ్చగానిండి భారతీయ
    లక్ష్మివై వచ్చితమ్మ! సంక్రాంతి లక్ష్మి
    మంగళములమ్మ! నీకు మా వందనములు.

—శ్రీ భాషాప్రవీణ అయ్యగారి రాఘవమ్మగారు

పాతిక సంవత్సరములు ఆంధ్ర భాషకు మొక్కవోని సేవ జేయుచున్న సాహిత్య పత్రిక,

# భారతి రజతోత్సవము

జనవరి నెల 8 వ తేదీని, శ్రీ భాగ్‌లో శతావధాని, శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి ఆధ్వర్యమున, "భారతి" రజతోత్సవము మహా వైభవో పేతముగా జరిగినది. పండితవర్యులు, కవిశేఖరులు, పత్రికా సంపాదకులు, చిత్రకారులు, రాష్ట్ర మంత్రులు, తదితరప్రముఖులు పెక్కుమంది యీ ఉత్సవములో పాల్గొనినారు. రాష్ట్రపతి, రాజాజీ, రాజేంద్రప్రసాద్, రంగా, రాధాకృష్ణ మొదలగు జాతీయ నాయకులు తమ శుభా కాంక్షల నంపారు.

శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారి, ఎర్రన, నన్నయ, తిక్కన రచనలనుండి ప్రార్థన గీతగానముతో సభ ప్రారంభమైనది. భారతి సంపాదకులైన శ్రీ శివలెంక శంభుప్రసాద్‌గారు అతిథులకు స్వాగతమిస్తూ, తమ ఉపన్యాసములో ఆంధ్ర వికాసానికి సర్వతోముఖంగా దోహద మిచ్చి అమరత్వాన్ని పొందిన, భారతి సంస్థాపకులగు, శ్రీ విశ్వదాత కళాప్రపూర్ణ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి సంకల్ప బలమే, వారి అమృత హస్తమే, పాతికేళ్లు నిర్విఘ్నంగా భారతి సాగుటకు కారణమని చెప్పిరి. "భావ కర్మ రంగములందు నిర్మాణ మార్గ మవలంబించుటకు పరితపించుచున్న" ఆంధ్ర హృదయమును "స్వకీయమైన స్వరూప భావములను నిర్ణయించి, స్వధర్మము నారాధింపవలె" నన్న ఆంధ్ర సంకల్పమును వ్యక్తము చేయుచూ, "పూర్వాపర సంస్కారములను సమన్వయించుటకే భారతి అవతరించినదనియు, నిగూఢములై ప్రకాశము నపేక్షించుచున్న ప్రాచీన మందిరములు, బౌద్ధస్థూపములు, తామ్ర శిలాశాసనములు, తాళపత్ర గ్రంథములు, కళా విచిత్రములు, వాఙ్మయ స్వరూపములు, తుప్పుపట్టిపోవుచున్న శాసనములు, పురాతన పుస్తక భాండాగారములలో శిథిలములగుచున్న వ్రాత ప్రతులు, వెలుగును గోరుచున్న అజంతా చిత్తరువులు, పరిశీలించవలసిన రసవత్తరమైన వాఙ్మయము, వీటియన్నిటి యందు భారతి సాదర భావమును జూపుచూ, సాహిత్యాభిమానులకు సమాన స్థాన మిచ్చినదని చెప్పి, భారతి యాత్రా విజయమునకు తోడ్పడిన సాహిత్యోపాసకులకు, చిత్రకారులకు, సకలవిధముల తోడ్పడిన సహచరులకు ధన్యవాదములర్పించిరి. ఇక మీద ప్రతి సంవత్సరాంతమునా, సంస్థాపకులైన శ్రీ నాగేశ్వరరావుగారి పేర ఆ సంవత్సరములో భారతిలో వెలువడిన ఉత్కృష్ట రచనకు రూ. 1116/- బహుమాన మీయబడుననికూడ శ్రీ శంభుప్రసాద్‌గారు తెలియపరచిరి.

ప్రజానాయకు లంపిన శుభసందేశములను చదివిన పిమ్మట అధ్యక్షులైన శ్రీ శతావధానిగారు, భారతి యొక్క ఉత్కృష్టతనూ, సేవనూ,

విరివిగా ఉగ్గడిస్తూ, "ఈ భారతి, దేవాలయంలో భారతి గాదు. ఇది యొక విగ్రహము కాదు. తెలుగు దేశంలో ఉండే రచయితలే యీ భారతి. వారు మథించిన వాగామృతమే భారతి. భారతికి ఉత్సవము జరుగుచున్న దనగా రచయితలకు జరుగుచున్నదన్న మాట....ఈ సజీవ భారతు లగు రచయితలు ఏలాగు బ్రతుకుతున్నారో పత్రికాధిపతులకు తెలియకపోదు. తెలుగు దేశములో పత్రికా పాఠకులే కొద్దిమంది. సాహిత్య పత్రికా పాఠకులు మరీ కొద్దిమంది. రచయితలు లక్ష కోకరైన ఉందురో ఉండరో. ఇదంతా కూపమండూక వ్యవహారం. పత్రికాధిపతులు యీ కూపంలోనే బంగారం తవ్వి ఎగ బొయ్యాలి" అని చెప్పారు. "బంగారంతో రచయితలకు లక్ష్మీ ప్రసాదము" చేయుచూ శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు వేసిన "బంగారు పునాదిమీద, రజతోత్సవమూ, సువర్ణోత్సవమూ" శ్రీ శంభు ప్రసాద్‌గారు జరుపవలె నని కోరుతూ వారు విరమించారు. తదుపరి, కవులు, వక్తలు, సంపాదకులు తదితర ప్రఖ్యాత పురుషులూ, వారివారి రుచులూ, అభిరుచులూ వెల్లడిస్తూ, భారతిని ప్రశంసిస్తూ ఉపన్యసించారు.





# తెలుగు తల్లి

శ్రీ వాద్రేవు జోగిపంతులుగారు

తెలుగు తల్లి నీకు జోహారు
ఆంధ్ర మాతా నీకు జేజేలు ॥తె॥

నిను జూచి నినుఁబాడి నీచరిత
వినుకంటె మాకెద్ది మోదమో ॥తె॥

కేసరీ, పట్టాభి రథ చోదకుల్గాగ
రాష్ట్రరథమును నీవె కదలింప వోయమ్మ॥తె॥

ఆంధ్ర స్వర్గాన బంగారు పీఠపై
ఆశీన వైన తల్లి దీవింప వోయమ్మ ॥తె॥

ఆంధ్ర మాతా ఉజ్జ్వల చరితా
మహిమోపేతా సద్గుణరాశీ ॥తె॥

ఏపూర్వ పుణ్యాన లభియించితివో
ఘటియించు చున్నాడ. అంజలి
గైకొని దీవింపవో తల్లి ॥తె॥

జననీ! ఆంధ్రమాతా! జోహారు!

సంసార జీవనములో

# పాకకళ

జానకి : కమలా, నీవు చెప్పిన రకాల్లో టొమాటోలు వండిచూచాను. అన్నీ చాలా బాగా వున్నాయి సుమీ. తియ్యగా ఉంటుందని కాబోలు, అన్నింటి కన్నా మా పిల్లలకు టొమాటోజామ్ నచ్చింది. మా పక్కయింటి అవిడకు కూడా యివన్నీ రుచిచూపించాను. టొమాటోభాత్ చాలా బాగా ఉన్నదని, వారి యింటికి యీమధ్య చుట్టాలు వస్తే వండి పెట్టారు.

చిన్నప్పటినుండి యివన్నీ నేర్చుకోటానికి నాకు శ్రద్ధ లేక పోయింది, కమలా పోనీ, యిప్పుడైతే నేమిలే. ఇంకా ఏమైనా కొత్త దినుసులు తయారు చేయటము చెప్తావేమో నని వచ్చాను.

కమల : ఓ, అంత కన్ననా ? ఇవాళ్ల ఏమి చెప్ప మంటావు ? అన్నట్టు యీమధ్య మామిడల్లం చాలా ఎక్కువగా దొరుకుతూ వుంది. మన తెలుగు దేశంలో యీవస్తువు దొరకదు కాబట్టి, మనవాళ్లకు యీ అల్లాన్ని ఎట్లా ఉపయోగించుకోవాలో తెలియదు. అయితే, దీనితో తయారు చేసే పదార్థాలు ఎంతరుచిగా, దేహారోగ్యకరంగా ఉంటాయను కున్నావ్ !

జానకి : అలాగా !

కమల : ఔను జానకీ ! మామిడల్లంతో మామూలుగా పచ్చడి, నిలవకు ఊరగాయ గూడ వేయవచ్చు. చెప్పేదను విను.

మామిడల్లపు పచ్చడి : మిరపకాయలు, సెనగపప్పు, మినపపప్పు, తగు మాత్రముగా వేయించుకో. ఇంగువ, ఆవాలు, జీలకఱ్ఱ, మెంతులు, మామూలుగా పుల్లపచ్చడి తిరగమోతకు వలె వేరుగా వేయించుకో. మామిడల్లమును బాగుగా కడిగి, చెక్కుతీసి, మెత్తగానూరి, తగుమాత్రము ఉప్పు, చింతపండువేసి యింకా కొంచము నూరు. తరువాత మిరపకాయలునూరి, మినపపప్పు, సెనగపప్పు దానితో కూడ యింక కొంచెంనూరి, తక్కిన తిరగమోత కలుపు.

మామిడల్లం వూరగాయ : మామిడల్లం బిళ్ళలు బిళ్ళలుగా సన్నగా తఱిగి, ఆ ముక్కలలో పచ్చిమిరపకాయలు, నిమ్మకాయరసం, వుప్పువేసి, తరువాత కొద్దిగా కారపుపొడి, వొక మిల్లిగరిటెడు నూనెవేసి బాగా కలియ బెట్టు. ఈ వూరగాయ వేసిన రోజుకంటే, రెండవ రోజుకు వూరి బాగుంటుంది.

ఈ విధంగానే మామిడల్లం తక్కిన వాటితో కలిపికూడ చేయవచ్చు.

మామిడల్లం, పచ్చిమిరియాలు, పచ్చి మిరపకాయలు, అల్లం, రాచవుసిరికాయలు, అన్నిటినీ సన్నగా ముక్కలు తఱిగి నిమ్మకాయరసం, వుప్పువేసి వూరవేయవచ్చు.

జానకి : పిల్లల కారోగ్యకరమైన, యిష్టమైన కొన్ని తీపి పిండివంటలు చెప్పుదూ, కమలా !

కమల : అయితే చెప్తాను, విను.

రాచ వుసిరికాయల జామ్ : కాయలు శుభ్రంగా కడిగి గింజలు లేకుండా చిన్నచిన్న ముక్కలుగా తఱిగి, ఆ ముక్కలు దేనితో కొలుస్తామో, దానితో అంతే చక్కెర వొక గిన్నెలోపోసి, కొద్దిగా నీళ్ళుకూడ కలిపి, పొయ్యిమీద పెట్టి, ఆ చక్కెర సన్నని పాకం వచ్చిన తరువాత, వుసిరి ముక్కలువేసి, సన్నని సెగమీద పెట్టి, కలియ పెట్టుచూ వుండవలెను. అది మంచి రొట్టెని రంగుకువచ్చిన పిదప దింపవలెను. ఈ "జామ్" నెల రోజులుండును.

కాశీ హల్వా : గుమ్మడికాయ చెక్కు తీసి, లోపలి మెత్తనిభాగం తీసివేసి, గట్టిభాగం తురుముకొని, వుడికించి తీసి, వొక ముతక గుడ్డలోవేసి బాగా పిండి అట్టి పెట్టుకోవలెను. బాదం పప్పులు, జీడి పప్పులు, పిస్తా పప్పులు, చార పప్పులు 2 పలాల నేతిలో వేయించుకో వలెను. తురుము వొక గిన్నెతో కొలిచి, దానితో సమానముగా చక్కెర

కూడ కొలిచి, ఆ చక్కెరలో కొంచెం నీళ్ళు పోసి పొయ్యి మీదపెట్టి, కొంచెం కరిగిన తరువాత, తురిమిన గుమ్మడి కాయ 1 అవున్సు పన్నీరు, యాలకపొడివేసి, సన్నని సెగ మీదపెట్టి కలుపుతూ వుంచవలెను. అది బాగా చిక్కపడిన తరువాత, 1 చిటిక కేసరి పౌడర్, నేతిలో వేయించివుంచు కున్న పప్పులు, ఆ నెయ్యి అన్నీవేసి కలిపి పొయ్యి మీది నుంచి దింపవలెను.

అమృత సంజీవిని : ఈ పిండివంట "నేంద్రంగా" అను పేరుతో అమ్మబడుచున్న మలబారు అరటికాయలతో చేసెదరు. ఇటువంటి అరటికాయలు నాలుగు సగముగా కోసి, వుడికించి తీసి, తొక్కవొలిచి, మెత్తగా రుబ్బుకొన వలెను. ఆ రుబ్బిన పిండిని వడలవలెతట్టి, నేతిలో యెఱ్ఱగా వేయించవలెను. పిదప 1 ఆశాకు చక్కెరలో కొద్దిగా నీళ్లు పోసి, పొయ్యిమీద పెట్టి, లేత పాకము వచ్చిన తరువాత, పొయ్యి మీదనుంచి దింపి, దానిలో 1 చిటికెడు కేసరి పౌడర్, యాలక పొడివేసి, వెంటనే వేయించి వుంచిన వడలు దానిలోవేసి బాగా కలుపవలెను.

ఇదే విధముగా కాయలు యెక్కువగు కొద్ది, చక్కెర కూడ యెక్కువ చేయవలెను.

వుర్లగడ్డ రసగుల్లా : 5 వుర్లగడ్డలు వుడికించి, వొలిచి మెత్తగా ముద్దలాగుచేసి, దానిలో ½ ఆశాకు మైదాపిండి లేక గోధుమపిండి, కొంచెం నెయ్యివేసి బాగా సద్దించవలెను. పిదప ఆ పిండిని గుండుగానైనా, కోలగానైనా వుండలుచేసి నేతిలో వేయించవలెను.

తరువాత 1 ఆశాకు చక్కెరలో, ½ ఆశాకు నీళ్ళుపోసి పొయ్యిమీదపెట్టి, ఆ చక్కెర కరిగే అంతవరకు వుడికించి దింపి కొద్దిగా కేసరి పౌడరువేసి బాగా కలిపి, వేయించిన వుండలు వేయవలెను. ఇవిబాగా 2 లేక 3 గంటల సేపు వూరిన తరువాత వాడుకొనవలెను.

"కమల"

# కాయగూరల జీర్ణకాల పట్టిక.

| దినుసుల పేర్లు | | | జీర్ణమగుటకు పట్టుకాలము. |
|---|---|---|---|
| వుడికించిన క్యారట్లు | .... | .... | 2 గం. |
| పచ్చి క్యారట్లు | .... | .... | 3½ గం. |
| బీట్ రూట్ | .... | .... | 2 గం. |
| పచ్చి టొమాటోలు | .... | .... | 2 గం. |
| బఠాణీలు | .... | .... | 1¾ గం. |
| బచ్చలి కూర | .... | .... | 1½ గం. |
| ఉల్లిపాయలు | .... | .... | 2½ గం. |
| చిక్కుడు కాయలు | .... | .... | 1½ గం. |
| క్యాబేజి | .... | .... | 1½ గం. |
| దోసకాయ | .... | .... | 2 గం. |
| టర్ నిప్స్ | .... | .... | 3 గం. |



# పరివర్తన

శ్రీమతి వట్టి అమ్మాజీగారు

"ఈ రోజున సినిమాయేనా ?"

"కాదు ............"

"ఎక్కడకు వెళ్లేది తెల్సుకోనరాదా ?"

"ఎందుకని ?"

"నా పట్ల ఇంత విముఖత ఏల ?"

"......................"

"నే చేసిన అపరాధమేముంది !"

"వాగకు...చీకాకు..............."

రాత్రి నిశ్శబ్దంలో ఈ మాటలు రాధ వింది. ఆమె కళ్ల వెంట అప్రయత్నంగా నీళ్లు కారాయి. ఆమె మణి గదివేపుకు పోయి చూచింది. మణి గవాక్షంకడ నిల్చుని ఏడుస్తోంది. రాధ తన గదికిపోయి దుఃఖించింది. ప్రక్క గదిలోని గడియారం ఒంటిగంట కొట్టుట రాధ వింది.

మణి కళ్లవెంట నీరు అడ్డులేకుండా ప్రవహిస్తూ ఉంది. ఆవిధంగ ఎంతవరకు వున్నదో ఆమెకు తెలియదు. ఆమె బయల్లోకి చూచింది. దూరానవున్న చెట్లపై ఋషి పక్షులు స్వేచ్ఛగా యెగురుతున్నాయ్. చేల్లో కుప్పలునూర్చే పనివాళ్ల పాటలు ఆశీతల వాయువుల్లో గంభీరముగా వినవస్తున్నాయ్. మణి నిట్టూర్పు విడిచింది. ఆమె గదిలోనికిపోయి దీపము ఆర్పి వసారాలో నిలచింది. రాత్రి కృష్ణవచ్చే సరికి మణి వసారాలో అలాగే నిల్చుంది. అతను విసురుగాను, నిర్లక్ష్యంగాను గదిలోకి పోయాడు. ఆమె సాలోచితంగా ఆకాశంవేపు చూచింది. నేత్రాలువిచార పూరితాలయ్యాయి. చంద్రుడు మేఘాలుచాటున దాగున్నప్పుడు కూడా ఆమె విశాల నేత్రాలు తారల్లా మెరిసిపోతున్నవి. గాలికి కేశకుంతలాలు ఆమె ఫాలభాగంపైబడి ముఖానికదో విథమైన సొగసును కూరుస్తున్నయ్. మణి వెనక్కు తిరిగి చూచింది. లోపల లైటువెల్గు గవాక్షంగుండా బయటికి ప్రసరిస్తోంది. మణి గవాక్షంగుండా లోనికి చూచింది. కృష్ణ సోఫాలో కూర్చున్నాడు. అతని సామీప్యానికి పోవాలని ప్రయత్నించింది.

"నా ఎడింత విముఖత కల్గున్నప్పుడు నే నేలపోవాలి !" అభిమానవతైన మణి ఆ ప్రయత్నం విరమించుకొంది. ఆమె తన గదిలోనికి పోయింది. మణి చాలాసార్లు తన పుట్టింటకు పోవలెనని ఆలోచించింది కానీ, తానా విధముగ పోవుట సమంజసము కాదనుకొంది. నారీ హృదయంకష్టాలు సహించటానికే విధాత సృజించాడు! మణి వచ్చి చాలా దినాలైంది. తల్లితండ్రులు చాలామార్లు పిలిచారు కానీ ఆమె పోలేక పోయింది. ఇప్పుడో ! ఆమె పుట్టింటకు పోవాలని నిశ్చయించింది. అందుకు ప్రయాణసరంజామా చేసికొన్నది. ఈ సంగతి రాధతో చెప్పిపోవాలని నిశ్చయించింది. తను ఏ విషయంలోనైనా రాధ సలహా తీసుకొంటేనేగాని ఏ పని చేయదు. ఆ ఇంట్లోకల్లా తనశ్రేయం కోరేది రాధ ఒక్కటే. తన కష్టసుఖాలు రాధతోనే చెప్పుకోవాలి. తనను ప్రేమించినా, ఆదరించినా రాధయే. తనను తల్లిలా సాకుతుంది.

రాధకు పెండ్లై అత్తింటికిపోతే ఆ ఇంట్లో తన్నిక ఆదరించే వారెవరు ! ఈ విషయం తల్చుకొనేటప్పటికి మణికపరిమితమైన దుఃఖంవచ్చింది. ఆమె రాధ గదివేపుకి చూచింది. అప్పుడే రాధ తనగదినుండి వచ్చింది. మణి కళ్లల్లోని అశ్రువులు రాధ హృదయాన్ని గాయపర్చినవి. రాధ మణిని కౌగిలించుకొని ఓదార్చింది. మణి అశ్రువులు తుడుచుకొని తన ప్రయాణం సంగతి చెప్పింది.

రాధ ఆవేగంతో "పోవద్దు వదినా ! నే నెంత మాత్రం సహించలేను," అంది.

"కృష్ణ ఉన్నాడా ?" అని రాధ ఆమెను అడిగింది.

మణి వుండెనన్నట్లుగ తలూపింది.

రాధ కృష్ణ గది వంకకు పోయి చూచింది. అన్న ఇంత రాత్రివరకు టెలిఫోనులో సంభాషించుట రాధకు ఆశ్చర్యం

కల్లకపోలా! మాటలు నెమ్మదిగ వింది. లీల ఎవరు ? రాధకు విస్మయం కల్గింది. ఆమె మణిని పంకుకోమని చెప్పి తన గదిలోకి పోయింది.

అగాధమైన బయల్లోకి శూన్యదృక్కుల్ని ప్రసరింపచేస్తూ రాధ పరిస్థితిని ఆలోచించ సాగింది. కృష్ణ ప్రవర్తనలో అనేక మార్పులు వచ్చాయ్.

అతను బయట ఎల్లా కాలం గడుపుతున్నాడో మణికి తెలీదు. అసలుమణికి తెల్సుకోవాలనే ఉద్దేశమేలేదు. అతను ఏంచేస్తున్నా పరాయివ్యక్తిలా సంచరించడం ఒక్కటే మణి చెయ్యకల్గింది. అతనితో ముభావంగా వుండటం అలవాటు చేసికున్నది. అల్లా ఆమెలో ఎంత సహనముందీ రాధకు తెల్సు. మణి స్థితిని తల్చుకొన్న కొద్ది భరింపరాని దుఃఖము తన హృదయంలో పొంగిపార్లింది. ఏ విధంగానైనా అన్న ప్రవర్తన మారితే మణి జీవితం బాగుపడునని రాధ ఊహించింది. కానీ కర్తవ్యం ! ఈ సంగతామెను కల్లోల పరచింది. ఉదయం రాధ కిటికీ తెరుస్తూ బయటకు చూచి నప్పుడు సుధ జ్ఞాపకంవచ్చింది. ఆమె వెంటనే హాల్లోకిపోయి టెలిఫోను రిసీవరును తీసి సుధను పిల్చింది.

"రాధా! కుశలమా!"

"సుధా! లీల......"

ఈ మాటలు పూర్తి చెయ్యకముందే సుధ లీలను గూర్చి చెప్పింది. ఊపిరి పీల్చుకోకుండా వింది రాధ. ఆమె శరీరం క్రోధంతో వణికింది. లీల ఇంత అవనీతిగా ప్రవర్తిస్తోందా! ఒక కాలేజిలో చదువుకొని స్నేహితులమై......ఛీ లీలా ! మణి జీవితం నాశన మొనర్చుటకా !

ఆ రోజున రాధ అన్నగారికి ఎన్నో నీతులు గరిపింది. కాని వినిపించుకోలా.

కృష్ణ సిటీవాస్తవ్యుడు. సిటీ పోలీష్, సిటీ ఎడ్యుకేషన్, సినీమా ఫేషన్స్, ఇవి అతని అభిరుచులు. ఇక మణి అంటే పల్లెటూరి మనిషి. ఇదంటే మణి ఇష్టపడదు. కట్నానికి ఆశించైతేనేమి, తండ్రికి జడిసి అయితేనేమి మణిని వివాహమాడాడు. మణి అందమైనదే. కొద్దో గొప్పో చదువుకుందే. కానీ ఇద్దరి అభిమతాల్కి భేదముంది. లీల అనగా కాలేజి విద్యార్థిని. సిటీ పోలీష్, సినీమా ఫేషన్స్, ఆమెవి. ఆమె కుత్రిమ వేషాల్కి కృష్ణ లోనయ్యాడు. ఇప్పుడతనిలో అనేక మార్పులు వచ్చినవి. లీలదగ్గరే రాత్రింబవళ్లుగడ్పుతున్నాడు. రాధ సర్వమూ తెలిసికున్నది. అన్న ప్రవర్తన మార్చేందుకు ఏమైనా సాధనాలున్నాయోమో నని వెతకటమే ఆమె పనైంది.

ఇప్పుడు రాధ పట్టుదలమీద మణి బాగా చదువుతుంది. అన్ని విషయాల్లోను మునుపటికంటె ఎక్కువ నేర్చుకున్నది. రాధ లీలనుగూర్చి ఎప్పటికప్పుడే తెల్సుకొంటుంది సుధవల్ల.

అక్కడ లీల సినీమాలో అభినయించుట కుత్సాహపడుతుందని కృష్ణ ఇందుకు ఇష్టపడడని దీన్నిగురించైనా వాళ్ల మైత్రికి భంగముకలుగ వచ్చునని, సుధ చెప్పింది. రాధ ఉత్సాహంతో ఈ మాట మణికిచెప్పింది.

అక్కడ కృష్ణకు లీలకు మైత్రిచెడి పోయింది. ఇప్పుడు ఆమె మరో స్నేహితునితో సినీమాలో నటించింది. కృష్ణకు ఒక్కసారిగ తన హీనస్థితి అంతా తెల్సిపోయింది. పశ్చాత్తాపంతో బాధపడ్డాడు. జరిగిన అవమానానికి మండి పోతున్నాడు. నిష్కారణముగ మణిని కష్టపెట్టినందుకు మానసిక వేదనపొందాడు. దేబె ముఖంతో ఇల్లు పట్టాడు. అతని హృదయం అనేక బాధలతో కొట్టుకొంటోంది. లీల దుర్ప్రవర్తన, మణి నిష్కళంకప్రేమ, సోదరి నీతి బోధనలు, ఇవన్నీ అతని హృదయాన్ని కలచి వేసాయి.

రాధ సర్వం తెల్సుకుంది. అన్న దగ్గరకు వెళ్లింది. రాధను వేడుకొన్నాడు, క్షమింపమని. రాధ అన్నను మణి దగ్గరకు తీసుకువెళ్లింది. కృష్ణ మణినిచూచి అద్భుతపడ్డాడు. అప్పుడు తెల్సుకున్నాడు ప్రేమవిలువ ! మణి ఆరాధ్య దేవతయని భావించాడు. ఇదంతా తన సోదరి నేర్పరితనమే అనుకొన్నాడు. రాధను అభినందించాడు. ఇప్పుడు రాధ హృదయము కుదుట పడింది.



# మహిళలలో జాగృతి

## మాతృసంఘము - బాలోద్యానవనము
### మదరాసు

బాలోద్యానవనము తరఫున ప్రారంభించిన "మాతృ సంఘము"నకు దైవకృపచే రెండు సంవత్సరములు నిండినవి. ప్రారంభించి నప్పటినుండి హిందీ తరగతులు జరుగుచున్నవి. 1946 లో 15 గురు స్త్రీలు హిందీ పరీక్షలకు వెళ్ళిరి. వారందరూ పరీక్షలలో వుత్తీర్ణులైరి, మఱియు వారిలో 7 గురు ప్రథమశ్రేణిని పొందిరి. కాని తరువాత కొన్ని కారణములచేత యీ తరగతులు తగురీతిని జరుగలేదు. మరల 1947 నవంబరునుండి హిందీ తరగతులు ప్రారంభింప బడినవి. 1948 సం॥ ఆగస్టులో ముగ్గురు రాష్ట్రభాష పరీక్షకు, నలుగురు మధ్యమకు, మఱి తొమ్మండుగురు ప్రాథమిక పరీక్షకు వెళ్ళిరి. వీరందరూ వుత్తీర్ణులైరి. వీరిలో ప్రాథమిక పరీక్షలో ముగ్గురు ప్రథమశ్రేణిలో వచ్చిరి. ఇవి గాక '48 సం॥ మార్చినుండి కుట్టు తరగతులుకూడ జరుగు చున్నవి. కుట్టు పరీక్షలలోకూడ చాలమంది స్త్రీలు వుత్తీర్ణులైరి. '48 సం॥ డిశంబరులో మరల నలుగురు స్త్రీలు కుట్టు పరీక్షకు వెళ్ళిరి.

ఈ సంస్థయొక్క వార్షికోత్సవము ది 23-12-48 న జరిగినది. గవర్నరుగారి సతి, భావనగర్ రాణీగారు యీ వుత్సవమునకు అధ్యక్షత వహించిరి.

ఈ సందర్భమున హిందీలో వక్తృత్వ పోటీలు జరిగినవి. వీనిలో 17 గురు విద్యార్థినులు పాల్గొనిరి. పట్టణములోని యితర హిందీ కేంద్రములనుండి కూడ విద్యార్థినులు వచ్చి వుత్సాహముతో పోటీలలో పాల్గొనిరి. సీనియర్ సెక్షన్‌లో 9 గురు పాల్గొనిరి. వారిలో శ్రీ వేదవల్లికి ప్రథమ బహుమానము, జయకు ద్వితీయ బహుమానము, శకుంతలకు తృతీయ బహుమానమును వచ్చినవి. జూనియర్ సెక్షన్‌లో 8 గురు పాల్గొనిరి. వారిలో అహల్య ప్రథమ బహుమానమును, సీతాలక్ష్మి ద్వితీయ బహుమానమును, సీతాదేవి తృతీయ బహుమానమును పొందిరి.

స్కూలు భవనములో కిండర్‌గార్టన్ పరికరముల ప్రదర్శనమును ఏర్పాటుచేసిరి. అందు 2½ వయస్సు మొదలు 5 సం॥ల వయస్సుగల బాల బాలికలచే చేయబడిన కొన్ని చేతిపనులు ప్రదర్శింపబడినవి. మఱియు ఆ వయస్సు పిల్లలకు యే విధమైన వస్తువుల సహాయముతో విద్య బోధించనగునో, అట్టి వస్తువులను ప్రదర్శిస్తూ, వాని ఉపయోగ విధానమును తెలుపబడినది.

తదుపరి సాయంత్రపు కార్యక్రమము ప్రార్థనతో ప్రారంభించిరి. పిదప పూజ్య బాపూజీ పఠమును మహారాణీగారు ఆవిష్కరించిరి. విద్యార్థినులు బాపూజీకి ప్రియమైన "వైష్ణవ జనతో" పాటను పాడిరి. విద్యాలయ ప్రిన్సిపాల్ గారైన ఎలెన్ శర్మగారు స్వాగతోపన్యాసము నిచ్చిరి. తరువాత సంగీతము, నాట్యము మొదలగు హృదయ రంజకమగు కార్యక్రమము జరిగినది.

శ్రీ టి. ఆర్. వెంకట్రామ శాస్త్రి గారు స్కూలు, మాతృ సంఘముల తరఫున మహారాణీగారికి అభివందనము లర్పించిరి.

అంతటితో సభ ముగిసినది.

—కస్తూరి రంగనాయకమ్మ

## ద్వితీయ పట్టణ మహిళా మహాసభ
### గుడివాడ.

29-12-48 వ తేదీన శ్రీమతి కూచిభట్ల కమలాదేవి బి.ఏ. గారి అధ్యక్షతన గుడివాడ పట్టణ మహిళా ద్వితీయ వార్షిక మహాసభ జరిగింది. ప॥ మ॥ కార్యదర్శిని శ్రీమతి సూరపనేని మనోరమగారు తమ కార్యదర్శిని నివేదికలో యీ సంఘము యొక్క పురోభివృద్ధినిగూర్చి వివరించారు. డాక్టర్ యిందిరా దేవిగారు ఎమ్. బి. బి. ఎస్., ప్రారంభోపన్యాస మిచ్చారు. 'తెలుగుదేశము' సంపాదకులు శ్రీమతి లక్ష్మీదేవిగారు, ఆంధ్ర రాష్ట్ర మహిళాసంఘ కార్యదర్శిని శ్రీమతి యీడ్పుగంటి రత్నమాంబగారు, శ్రీమతి గుడిపూడి యిందుమతీ దేవిగారు మహిళా సమస్యలను గురించి వుపన్యసించారు. శ్రీమతులు ముదునూరు హైమవతి, సూర్యనేని దమయంతి, కోగంటి శకుంతలాదేవిగార్లు కూడ వుపన్యసించారు. ఆ సభలో యీ దిగువ తీర్మానములు చేయబడినవి.

1. భారత భాగ్యవిధాత, విశ్వకల్యాణాభిలాషి, త్యాగధనుడు, మహిళా జనోద్ధారకుడు అగు పూజ్య బాపూజీ దుర్మరణము అఖండ భారతావనికేగాక సమస్త ప్రపంచానికి ముఖ్యముగా మహిళాలోకానికి గొడ్డలిపెట్టుగా భావించుచు

యీ దుస్సంఘటనకు యీ సభవారు తమ సంతాపమును తెలియ జేయుచున్నారు.

2. పట్టణ మహిళా సంఘకార్య నిర్వాహక వర్గము వారి కోరికను మన్నించి గుడివాడ మ్యునిసిపల్ కౌన్సిలువారు గౌరీశంకర్ పార్కు ప్రక్కనవున్న తమ స్థలమును మహిళా సంఘముయొక్క భవనమును నిర్మించుటకై వుచితముగా యిచ్చినందుకు, సదరు స్థలములో భవనము నిమిత్తము రు. 1000 లు. రొఖము విరాళము యిచ్చినందులకు యీ సభ వారు మునిసిపాలిటీ వారికి తమ హృదయపూర్వక కృతజ్ఞతను తెలియజేయుచున్నారు.

3. సదరు స్థలములో మహిళాసంఘ కార్యాలయ భవనము నిర్మించుటకు విరివిగా విరాళములొసగి తోడ్పడవలసినదిగాను, అందుమూలముగా మహిళా సంఘము పురోభివృద్ధి జరుగుతుందని ఆశిస్తూ యీ సభవారు తీర్మానముచేస్తున్నారు.

కృష్ణాజిల్లా మహిళా సభ
గు డి వా డ.

30-12-48 వ తేదీన శ్రీమతి శిరాజ్యం సిన్హా గారి అధ్యక్షత న 7 వ కృష్ణాజిల్లా మహిళామహాసభ జరిగింది.

శ్రీమతి పెద్దాడ సరస్వతమ్మగారు బి. ఏ. గారు జండా ప్రతిష్టాపన చేశారు. శ్రీమతి గోనుగుంట్ల లక్ష్మీనరసమ్మగారు సభికులందరకు స్వాగతము చెప్పారు. కృష్ణాజిల్లా మహిళా సంఘ కార్యదర్శిని శ్రీమతి యీడ్పుగంటి శ్యామ్‌దేవిగారు కార్యదర్శి నివేదిక చదివి వినిపించారు.

సభా ప్రారంభము శ్రీమతి ఎలకూరి సుబ్బరత్నమ్మగారు చేశారు. శ్రీమతులు సూర్య దేవర అన్నపూర్ణమ్మగారు, వుప్పల పాటి పంచాక్షరిగారు, సూర్పనేని నవరత్నమ్మగారు, యెలమంచి దమయంతమ్మగారు, గారపాటి రామసీతమ్మగారు, కాట్రగడ్డ సితారత్నమ్మగారు వుపన్యసించారు. సభానంతరము 9 గంllలకు శ్రీరామానాట్య మండలివారు, 'నేటినటుడు' 'మాతృపూజ', అను రెండు నాటకములు ప్రదర్శించారు. హైస్కూలు విద్యార్థినుల జాతీయ గీతముతో సభ ముగింపబడినది.

**తీర్మానములు :**

భారతదేశ దాస్య విమోచన ప్రదాత, శాంతిదూత, అహింసామూర్తి, స్త్రీలపాలిట కల్పతరువు, అమరజీవియైన, పూజ్యబాపూజీ మరణానికి యీ సభ వారు యెంతో దుఃఖిస్తూ ఆ మహనీయుడు తన జీవితకాలములో మనకు ప్రబోధించిన ఆశయాల ప్రకారము స్త్రీలంతా నడచుకొనవలయునని కోరుచున్నారు.

2. ప్రభుత్వము అన్నిశాఖల్లోను స్త్రీ, పురుష భేదము లేకుండా స్త్రీలకుకూడ సమానావకాశా లిచ్చినందులకు యీ సభవారు కేంద్రప్రభుత్వాన్ని అభినందిస్తూ అట్టి అవకాశమును స్త్రీలందరు వినియోగించు కోవలసినదిగా యీ సభవారు సోదరీమణులను కోరుచున్నారు.

3. హిందూ కోడ్ బిల్లును కేంద్ర ప్రభుత్వము వారు శాసనముగా చేయుటలో ఆలస్యము చేస్తున్నందులకు యీ సభవారు చాల విచారపడుచు వెంటనే ఆ బిల్లును శాసన రూపంగా అమలులోకి తెచ్చేటట్లు కేంద్రప్రభుత్వము వారిని యీ సభవారు కోరుచున్నారు.

4. ప్రతి జంక్షను రైల్వే స్టేషనులోను స్త్రీలకు ప్రత్యేకముగా బుక్కింగు ఆఫీసు ఏర్పాటు చేయవలసిందని, ప్రతి రైల్లోను యిప్పటికన్న హెచ్చు పెట్టెలను వేయవలసినదిగా ప్రభుత్వము వారిని యీ సభవారు కోరుచున్నారు.

5. స్వతంత్ర భారతావనిని అచిరకాలములో విద్యాసంపన్నురాలిగా చేయుటకు వుచిత నిర్బంధ ప్రాథమిక విద్యా విధానాన్ని వెంటనే ప్రవేశ పెట్టవలసినదిగా ప్రభుత్వాన్ని యీ సభవారు కోరుచున్నారు.

6. వయోజన వోటింగు హక్కువలన మనకు లభించిన అవకాశాలను గురించి స్త్రీలు స్థానిక సంస్థల్లోను, శాసనసభలలోను సమానస్థానాల్ని సంపాదించుకోడానికి కృషి చేయాలని యీ సభవారు కోరుతున్నారు.

7. ప్రతి స్త్రీ రాజకీయంగాను, సాంఘికంగాను అభివృద్ధిలోకివచ్చి పురుషులతో సమానముగా పని చేయవలెనన్న విద్యాధికులు కావాలి. ఈ నాడు స్త్రీలకు ప్రతేకముగా విరివిగా పాఠశాలలు లేవు. అందుచే బాలుర పాఠశాలలలోనే జదువవలసి వస్తోంది. బాలుర పాఠశాలలో స్త్రీలకు సరియైన వసతులు లభించుటలేదు. కాన స్త్రీలకు ప్రత్యేకముగా తాలూకాకొక సెకండరీ పాఠశాల, జిల్లాకొక కళాశాల స్థాపించవలసినదిగా ప్రభుత్వాన్ని యీ సభవారు కోరుచున్నారు.



సి ని మా

# డాక్యుమెంటరీ చిత్రాలు

"డాక్యుమెంటరీ" చిత్రాలంటే ఏమిటి? "షార్టు" చిత్రాలా లేక సాధారణ సినిమాలా? ఈ రెండూ కావు. మన దిన జీవితంలోజరిగే విషయాలు, ప్రజలయొక్క విద్యా జ్ఞానాభివృద్ధికరములగు విషయాలు, ప్రజలందరికిని అర్థమగునట్లు ప్రతిబింబించు చిత్రాలకే "డ్యాకుమెంటరీ" చిత్రాలనిపేరు. అనగా వాస్తవిక చిత్రాలన్నమాట. ఇవి 16 మిల్లీ మీటర్లలోను లేక 35 మిల్లీమీటర్లలోను ఉండును. ఈ చిత్రాల పరిస్థితి మన దేశంలో ఇంకా బాల్యావస్థలోనున్నది.

ఈ "వాస్తవిక" చిత్రాలకు బుట్టినిల్లు బ్రిటన్. హాలీవుడ్‌లోగూడ వాస్తవిక చిత్రాలను తయారు చేసారు కాని వారు వినోదకథలకు, ప్రచార సంబంధములైన విషయాలకు ప్రాధాన్యత యిచ్చారు. ఇటీవల అమెరికనులు కూడ ఈ చిత్రాలవల్లగల్గు లాభాలను గుర్తిస్తున్నారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధసమయంలో "Information-Film of India" (హిందూ దేశ సమాచార చిత్రాలు) అను సంస్థను స్థాపించారు. ఆ సంస్థ ద్వారా యుద్ధ ప్రచారానికి గావలసిన విషయములను, రణరంగములోని దృశ్యములను "వాస్తవిక" చిత్రాలుగాతీసి ప్రజలకుజూపిస్తూ వచ్చారు. కాని యుద్ధము ముగిసిన వెనుక చిత్రాలేవియు ఎక్కువగా తయారు కాలేదు. ఇప్పుడు మన ప్రభుత్వం వారు "వాస్తవిక" చిత్రాలవల్ల ప్రజా బాహుళ్యానికిగల్గు మేలును గుర్తించి, ఈ చిత్రాలను అభివృద్ధి చేయుటకై మిక్కిలి కృషిచేయాలని భావిస్తున్నారు.

సాధారణ చిత్రాలవలె "వాస్తవిక" చిత్రాలకు కథావస్తువు, నటీనటులు, స్టూడియోలు మొదలగునవి అనవసరము. నిత్య జీవితంలోని దృశ్యాలకివి ఎందులకు? ఈ చిత్రాలను తయారు చేయుటకు నిపుణులైన టెక్నీషియన్లు, డైరక్టర్లు కావలయును. తగుమాత్రం ప్రోత్సాహము ఉంటే మన సినిమాలోకంలో అట్టి వారు కానరాకపోరు.

ఈ "వాస్తవిక" చిత్రాలు పిల్లలకేమి, విద్యావంతులకేమి, వయోజనులకేమి—అందరికి ఉపయోగపడుతాయి. వీటివలన ముఖ్యముగా మూడు లాభాలున్నాయి.

1. చిన్న పిల్లలకు విద్యను సులభంగా నేర్పవచ్చును—ప్రస్తుతం విద్యాప్రణాళిక లెన్నియో అమలులోనికి వచ్చుచున్నాయి. అవి బాల బాలికలు నిత్యజీవితంలో తెలుసుకోవలసిన విషయములను దెలిసికొనుట కెంతో తోడ్పడుతాయి. వాటినన్నిటిని ఉపాధ్యాయులుగాని, తల్లిదండ్రులుగాని వారికి భోధింపజాలరు. ఆ సమయంలో వాస్తవిక చిత్రాల ద్వారా వారికి అన్నియు సులభముగా జెప్ప వచ్చును. బ్రిటన్, అమెరికా, రష్యా మొదలగు పాశ్చాత్య దేశాలలో బాల బాలికలకు ప్రతివారం ప్రత్యేక వాస్తవిక చిత్రాలు, బడివారో లేక, బాల బాలికల క్లబ్బువారో ప్రదర్శిస్తారు. ఇట్లు చేయుటచే వారు తమ చిన్నతనములోనే ప్రపంచ జ్ఞానమును బొందువారగుదురు.

2. వయోజన విద్యాభివృద్ధి: మన దేశంలో 100 కి 90 మంది విద్యావిహీనులు. వారికి విద్యగరపుటకై చిన్నవారిని బడిలో జేర్పించి, పెద్దవారికై (అంటే కర్షకులు, కూలినాలిచేసి బ్రతుకువారు, ఫాక్టరీ పనివారు) రాత్రిబడుల (Night Schools)ను స్థాపించి ప్రభుత్వం వారనేక వయోజనవిద్యా ప్రణాళికల నమలు లోనికి తెచ్చు చున్నారు. వయోజనులకు విద్య గరుపుటకు వాస్తవిక చిత్రాలు ఎంతో తోడ్పడుతాయి. రాత్రులందు వారి కుపయోగపడు చిత్రాలను జూపవచ్చును. ఇట్లు చేయుటచే వారు విద్యావంతులగుట కెంతయో అవకాశమున్నది.

3. ప్రజల ప్రపంచజ్ఞానాభివృద్ధి కెక్కువ తోడ్పడును: పట్టణవాసులకు గ్రామాలలోని విషయాలు (అంటే పైరు పంటల విషయాలు, అచ్చటి ఆరోగ్య జీవితము మొదలగునవి) దెలియవు. గ్రామస్థులకు పెద్దపెద్ద నగరాలలోని వింత విషయములు దెలియవు. వాటిని ఆ ఆ తరగతి వారికి తెలియజేయుటకుకూడ ఈ చిత్రాలెంతో తోడ్పడుతాయి. మరియు దేహారోగ్యానికి సంబంధించిన చిత్రాలు కలరా, మసూచికం మొదలగు అంటు వ్యాధుల పుట్టుపూర్వోత్తరాలు, వాటిని నిర్మూలింపజేయు విధానములు యిట్టి విషయాలు దెల్పు చిత్రాలు గ్రామస్థులకేగాక ఎల్లవారికి మేలు గలిగించును.

## డాక్యుమెంటరీ చిత్రాలు

ఏ విషయమైన పూరక వినుటకన్న, చిత్రాలవలన చూచి నేర్చుకొనడం సులభము. విషయము అప్పుడు బాగుగా మనస్సుకు పట్టుబడు అవకాశము కలుగుతుంది.

ఇక యిటువంటి చిత్రాలు తీసే విషయాన్ని గమనిద్దాం. ప్రస్తుతం ప్రొడ్యూసర్లు స్వలాభానికై పుక్కిటి పురాణ చిత్రాలు, జానపదచిత్రాలు, మరియు సాంఘిక చిత్రాలనే పేరుతో ఒట్టి చెత్తచిత్రాలు తయారు చేయుచున్నారు. టెక్నిషియన్లు ప్రొడ్యూసర్ల చేతి కీలుబొమ్మలై యుంటారు. స్వలాభ కాంక్షలేని ఏ ప్రొడ్యూసరో ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని తీయదలచిన అతనికి టెక్నిషియన్లు ఎవరు తోడ్పడరు. టెక్నిషియనులు లేకుంటే చిత్రం ఎలా వస్తుంది? అందువలన కొంతమంది ప్రొడ్యూసర్లు మొత్తం పెట్టుబడిని పెట్టి, టెక్నిషియన్లకు ఎక్కువ జీతాలిచ్చుచు, ఉత్తమ డాక్యుమెంటరీ చిత్రాలు తీయవచ్చును. ప్రభుత్వం కూడ ఆ పెట్టుబడిదారులకు, ప్రొడ్యూసర్లకు, ఏ కొద్దో గొప్పో "గ్రాంటు"ను యివ్వవలయును. మరియు ప్రభుత్వం వారు సాధారణ సినిమాల ఫిలిమ్ పొడవును చాలావరకు తగ్గించి, మిగిలిన ముడి ఫిలింను 'డాక్యుమెంటరీ' చిత్రాలు దీయు వారికి సరసమైన ధరల కమ్మవలయును. మరియు అట్లు తయారైన చిత్రాలకు "ప్రచారము" ప్రభుత్వం వారే చేయవలయును. ఏలయన డిస్ట్రిబ్యూటర్లు డాక్యుమెంటరీ చిత్రాల ద్వార తమకు లాభము చేకూరునో లేదోయని తలచి అట్టి చిత్రాలకు "హక్కులను" తీసుకొనరు. ఆ చిత్రాలను ప్రదర్శించుటకు కావలసిన 16 మిల్లీమీటర్ల ప్రొజక్టరునో లేక 35 మిల్లిమీటర్ల ప్రొజక్టరునో ప్రభుత్వంవారు విదేశములనుండి తెప్పించి, వాటిని సరసమైన ధరలకు చిత్రాలను చూపించువారి కమ్మవలయును, లేదా వారి యాధీనములోనే వాటిని యుంచుకొని వారే ఆ చిత్రాలను జూపించవలయును.

ఇట్లు చేయుటవలననే ఈ వాస్తవిక చిత్రాలు అభివృద్ధిలోనికి వస్తాయి. మరియు ప్రభుత్వంవారు ప్రొడ్యూసర్లుకూడ ఈ డాక్యుమెంటరీ చిత్రాలను తమ ఆస్తులవలె జూచి, ఇవి దేశాభివృద్ధికై దోడ్పడు అమూల్య వస్తువులని భావించవలయును.

గ. లీ.

# "చంద్రలేఖ" (హిందీ)

అలెగ్జాండ్రా కోర్డావారు సాబు నటించిన "Baghdad Ka chor" అన్న ఆంగ్లేయ చిత్రాన్ని హిందీలోనికి "డబ్బింగ్" చేసి మన దేశంలో ప్రదర్శించినప్పుడు మనం యెంతో గర్వించాము. కాని, ఇప్పుడు దక్షిణ భారత దేశస్థులు తమ అరవ ఫిలింను హిందీలోనికి "డబ్బింగ్" చేసి ఉత్తర దేశస్థులకు చూపడంపట్ల మనమంతా గర్వించదగినది.

జెమినీవారు తమఅరవ "చంద్రలేఖ"ను హిందీభాషలో "డబ్బింగ్" చేసారు. ఈ చిత్రాన్ని జనవరి 5వ తేది మద్రాసు "వెల్లింగ్టన్"లో పత్రికా ప్రతినిధులకై ప్రదర్శించారు.

ఒక భాషాచిత్రాన్ని ఇంకొక భాషలోనికి "డబ్బింగ్" చేయడం సాధారణమైన విషయం కాదు. ఎంతో ఓర్పు, సాహసము, చాతుర్యము, తెలివి తేటలుంటేగాని అట్టి కార్యాన్ని నెరవేర్చలేము. ఈ కష్టాలన్నింటిని సాహసంతో ఎదుర్కొని జెమినీవారు హిందీ "చంద్రలేఖ"ను తయారు చేసారు. అరవ చిత్రంకంటే, హిందీ చిత్రం చాల బాగుంది. ఈ చిత్రం పొడవు సుమారు 14 వేల అడుగులు. అరవ చిత్రంలోని అనవసర ఘట్టాలు, అసందర్భ హాస్యాలు మొదలైనవి హిందీ చిత్రంలోలేవు. అరవ చిత్రంలోని కొన్ని లోపాలను గుర్తించి, ఆ లోపాలను "హిందీ" ఫిలింలో సరిదిద్దుకొని, ప్రేక్షకుల కన్నుల కింపగునట్లు జెమినీవారు తయారు చేసారు.

అరవ 'చంద్రలేఖ'లోని చాలా ఘట్టాను హిందీ చిత్రంలోవుంచి, ఉత్తరదేశస్థులకై వేరేఘట్టాలను తిరిగి "షూట్" చేసినారు. ఉదాహరణకు, అరవ చిత్రంలో సర్కసు ప్రేక్షకులంతా దక్షిణ దేశస్థులై యున్నారు. కాని హిందీ చిత్రంలో వారు ఉత్తర దేశస్థులైయున్నారు. ఈ ఘట్టాన్ని చూస్తే మనకెంతో ఆశ్చర్యముగా వుంటుంది. కథానాయకురాలు, టి. ఆర్. రాజకుమారి హిందీచిత్రంలో కొన్ని చోట్ల ఉత్తరదేశపు దుస్తులను ధరిస్తుంది. సర్కసు గూడెంలో తన ప్రియునకు పండ్లు, రొట్టెలు తీసుకొని పోవునపుడు అరవ చిత్రంలో చంద్రలేఖ దక్షిణాది దుస్తులను ధరిస్తుంది. కాని అదే ఘట్టంలో హిందీ చిత్రంలో 'చంద్రలేఖ' పంజాబి దుస్తులను వేసుకొనియుంటుంది. హిందీ చిత్రం చూస్తున్నప్పుడు నిజంగా నటీ నటులే మాట్లాడునట్లును, పాడునట్లును వుంటుంది. కొన్ని చోట్ల (close-ups)లో వార్ల చేతనే మాట్లాడించి యున్నారు.

రాజకుమారి కంఠానికి, ఆమె కొరకు తీసుకొన్న శ్రీమతి ఉమాదేవి కంఠానికి ఏమాత్రం భేదంలేదు. హిందీచిత్రంలో యన్. యస్. కృష్ణన్, టి. ఏ. మధురంల ఘట్టాలు లేవు. వారికి బదులు యశోదరాకట్జూ, చోప్రా అనే హిందీ నటీ నటులను ప్రవేశపెట్టారు.

ఈ చిత్రంలో పాటలు చెవులకు యింపుగ వున్నాయి. "నాట్టియకుదిరై" "సర్కసుకంపెనివారి బృందగానము" "బండివాండ్లపాట" మొదలైనవి అరవ చిత్రంలోని పాట వరుసలోనే వున్నాయి. ఇంకను కొన్ని క్రొత్త హిందీట్యూనులలో క్రొత్తపాటలు కొన్నియున్నాయి.

ఈ చిత్రానికి సుప్రసిద్ధులైన పండిత ఇంద్రా, ఆగాజానీ కాశ్మీర్, భారత్‌వ్యాసులు, పాటలు సంభాషణలు వ్రాసినారు. ప్రఖ్యాత ఎస్. రాజేశ్వరరావుగారి సంగీతము ఈ చిత్రానికి శోభ తెచ్చింది.

ఈ చిత్రాన్ని కలకత్తాలో డిసంబరు 24వ తేది, ఒకేసారి 3 థియేటర్లలో విడుదల చేసారు. రోజు 4 ప్రదర్శనాలు జరుగుచున్నప్పటికి ప్రజలు తండోప తండాలుగా చిత్రాన్ని చూస్తున్నారు. ఈ చిత్రం దక్షిణదేశంలో ఏప్రిల్ నెలలో విడుదల కావచ్చును. కలకత్తాలో "చంద్రలేఖ" ప్రారంభోత్సవ సమయమున, పశ్చిమ బెంగాల్ గవర్నరయిన శ్రీయుత డాక్టర్ కైలాసనాథ్‌కట్జూగారు అధ్యక్షత పదవిని వహించి, చిత్రాన్ని చూచిన వెనుక ఈ విధంగా చిత్రాన్ని ప్రశంసించారు. "నేను కొన్ని సినిమాలేచూసాను. చూచిన వాటిలో "చంద్రలేఖ"యే అన్నిటికంటే బాగుంది. నేను చిత్రాన్ని ఒకగంటసేపు చూద్దామని వచ్చాను. కాని చిత్రం ఆఖరైయ్యేవరకువుండి పోయాను. చిత్రాన్ని జూచునప్పుడు నేను ఒక అద్భుత లోకంలో ఉన్నట్లుండినది."

ఈ చిత్రాన్ని తయారుచేసి దక్షిణ భారతదేశ ఫిలిం పరిశ్రమకు వన్నెదెచ్చిన జెమినీవారు, ఈ చిత్ర దర్శకుడు శ్రీ యస్. యస్. వాసన్‌గారు అత్యంత శ్లాఘాపాత్రులు.

—శ్రీమతి గజ్జెల లీల.



(24వ పేజీ తరువాయి)

సమీక్ష :

ఐదవ ప్రకరణములో కమీషన్ వారి సమీక్ష వ్రాయబడినది. దానిలో భాషా ప్రయుక్త రాష్ట్రములు " ఉప జాతీయత "ను ప్రకోపింపజేసి మొదట అఖిల భారత జాతీయతకే ముప్పుతెచ్చును అని అభిప్రాయ పడుచున్నది. ఉప జాతీయతా నిర్మాణమే లక్ష్యమైన, భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణమునకంటే వేరొకమార్గములేదు. చరిత్రాత్మక పరిస్థితులవలన ఏక భాషమాట్లాడువారు పలుపరిపాలనా ప్రాంతములలో చెదిరియుండుటచే, వారు వేర్వేరు ప్రకృతులు కలిగి, సమైక్యత కొరకు ఎక్కువ ఆతురత చూపుట లేదు. ఒక ప్రాంతములో భాషారాష్ట్ర నిర్మాణమున కియ్యకొనిన, దేశ నలుమూలలనుండి,అట్టి విభజనకై ఆందోళనలు వెలువడవచ్చును. అది నేడు ప్రస్ఫుటముగా కానవచ్చుచున్నదికూడా.

జాతియత-ఉపజాతీయతా నిర్ధారణ :

భారత జాతీయతకు ప్రాంతీయ భాషలకు అన్యోన్య సంబంధమున్నది. దేశభక్తి ఉద్వేగ పూరితమై రాష్ట్ర సరిహద్దులనంటి పెట్టుకొని యున్నది. ఇండియా జాతీయత నశించకుండా ఉండాలంటే మనకున్న కొన్ని లక్ష్యాలను ఆశయాలను దేశీయ జాతీయ క్షేమములకై విడనాడ వలసి ఉంటుంది. జాతీయత స్థిరపడి, బలము చేకూర్చుకొని, స్వయం సమృద్ధమగు రాష్ట్రముల నేర్పాటు చేసుకొనువరకూ రాష్ట్ర సరిహద్దులలోనూ, ప్రభుత్వాధికారములోనూ కేంద్ర ప్రభుత్వానికే సర్వాధికారము కలిగి, దాని ఏజెంట్లుగా రాష్ట్ర ప్రభుత్వములు వ్యవహరించాలి. ఈ విస్తృతాధికారములు, వివిధ భాషలవారి మధ్య విభేదములవలన ప్రభుత్వయంత్రము విచ్ఛిన్నము కాకుండుటకు, విభజన శక్తుల నరికట్టి వాటిని జాతీయతకై సమీకరించుటకు, జాతీయతను సుస్థిర మొనర్చి ఏక భారత జాతి నేర్పాటు చేయుటకు కేంద్ర ప్రభుత్వము, చేతులలో నుండాలి.

భాషా ప్రయుక్తముగా దేశమును పునర్విభజించిన, ఆ యా భాషాప్రాంతాలలోని ప్రజలు సర్వతో ముఖముగా వృద్ధి నొందుదురనీ, జాతీయతకు యితోధిక సేవ చేయ కలుగుదురనీ ఒక వాదన ఉన్నది. కాని యిది ఒక పొరపాటు అభిప్రాయము. ఉపజాతీయతాభిమానము జాతీయతాభిమానమున కన్న మిన్నయై అంతరుప జాతీయతా వైమనస్యంలో, జాతీయతకు విలువ యివ్వబడక హాని కలుగును అని అభిప్రాయము తెలిపిరి.

ఇండియా సంస్థానాల భవిష్యత్తు తేలిన తరువాత, దేశ జాతీయత స్థిరపడిన వెనుక, నేటి రాష్ట్రములలో కొన్నిటిని భాషా ప్రాతిపదికపై గాక, పరిపాలనా సౌలభ్యమునకై ఏర్పాటు చేయవచ్చును.

దేశరక్షణ, కాందిశీకులు, అధికచలామణి, ఉత్పత్తి, ఆహారక్షామము మొదలగు సమస్యలు ' అరనికొరివి 'లై యుండగా, రాష్ట్ర పునర్నిర్మాణము చేయతగదు. కేంద్ర ప్రభుత్వమునకు విస్తృతాధికారములుండి, ఆ సేతు హిమాచల పర్యంతము ఏక జాతీయభాష నేర్పాటు చేయవలెనను కొందరి అభిప్రాయముతో యీ కమిటీవారు ఏకీభవించుచున్నారు.

ఈ సమయములో నే ఒక విషయముచెప్పవలసియున్నది.

కొన్ని రాష్ట్రములందు అనగా, మద్రాసు బొంబాయి రాష్ట్రములందు, పరిపాలనా విధానములో చిక్కులున్నవి. మద్రాసునందు తెలుగు తమిళవాదము, కర్నాటక మహారాష్ట్ర గుజరాతీ వివాదములు బొంబాయియందు కానవచ్చుచున్నవి. వీటి నివారణకై కేంద్ర ప్రభుత్వము చర్య తీసుకొవలసియున్నది.

(ఇది థార్ కమిటీ నివేదిక సంగ్రహము.)





# ఆలయ ప్రవేశము

"అక్క"

నాడు సాయంత్రం, అప్పడు, వీరడు చుట్ట కాలుస్తూ అరుగుమీద కూర్చుని, లోకాభిరామాయణం మాట్లాడుకుంటున్నారు.

అప్పడు :— వీరయ్యా, యీ శుక్రవారం మన వేణు గోపాలస్వామి కోవెల మనకందరికి వదలి పెడతారట. మనమంతా వెళ్ళి స్వామి దర్శనము చేయవచ్చునట. గుళ్ళోకి వదలతారట. నాడు నే వెళ్ళాలనుకున్నాను. నీవు మరచి పోకుండా రా.

వీరడు :— ఆ, యిక యీ బాపనోళ్ళు మనల నేం చేయ గలరు.

అని యంటుండగానే రామబ్రహ్మం గారు వీధిలోకి వచ్చారు. ఆయనను చూడగానే యీ మాలలిద్దరూ, దూరముగాబోయి, నిలబడ్డారు.

"సామే, మమ్ములను కోవెలలోకి వదలుతారట రేపు శుక్రవారం" అన్నాడు అప్పడు.

"సామీ, ఇక మీరు మేముఅంతా వొకటైనట్లేగదండి. ఆ గాంధిగారు పెళ్ళిళ్ళుకూడ చేసుకోవచ్చు నన్నారట" యన్నాడు వీరడు. "యికనేం" యన్నాడప్పడు.

వీళ్ళిద్దరిట్లు సంబరపడడం రామబ్రహ్మంగారికి పట్టరాని కోపం వచ్చినది. అయితే, అప్పణ్ణి ఆయన ఏమీ చేయలేదు. అప్పడూ, వీరడూ స్నేహితులు. అప్పడికి అయ్యగారితో సంబంధంలేదు. వీరడు అయ్యగారి పొలములో పని చేయు వాడు. ఇంటి వెనుక దూరముగ అయ్యగారువేసిచ్చిన పాకలో భార్యా బిడ్డలతో కాపురమున్నాడు. వీరి సంభాషణ విని అయ్యగారికి ఆగ్రహమొచ్చినదని చెప్పాను కదా. వీరణ్ణి అరికాలిక్రింద పెట్టి రాచేయవలెనని సంకల్పించాడు అతనిని పిలిచి,

"వీరడూ! శుక్రవారంలోపల నా రెండు వందల రూపాయలు అప్పతీర్చేయాలి. ఇకవొక్క నిమిషమునే నాగను"

అని చెప్పి, "దూరంగా పోవెధవా, మీది మీది కొస్తావేమి? ఆలయ ప్రవేశమైతే నాకేం? నా మీదపడకు"

అని కేకలేశాడు. వీరడూ, అప్పడూ నక్కుతూనక్కుతూ వెనక్కు వెనక్కు వెళ్లారు.

మరునాడు సాయంత్రం ఇంటికి వెళ్లగానే, వీరడి భార్య వానిని జూచి,

"నీవు, నా కెక్కడ దాపరించావు? ఏదో లేని పోని తగువులు తెస్తావు? నలుగురిలో నా సిగ్గుబోతుంది. నే చావలేను నీతో. నీ కెందుకు పంతులు గారితో వాదం? వాళ్ల అమ్మాయిని పెళ్లిచేసుకుంటానని ఎకచెక్కాలు మాట్లాడావట, ఆయనకు కోపం వచ్చిందట. రేపు సాయంత్రం లోపల పాక కాళీచేయకపోతే తట్టా బుట్టా బయటు పడేసి పాక పీకేస్తారట. ఈ గొడవంతా వాళ్ళ చాకలాడు వచ్చి చెప్పాడు. పంతులుగారమ్మాయిని పెండ్లాడుతాడట. పంతులుగారమ్మాయిని, యీ వెర్రిమొగం" అని అప్పుడే తనకు సవతివచ్చినంత కోపంతో తూర్పార బట్టినది.

వీరడు నిశ్చేష్టుడైనాడు. అయ్యో, "నేనేం తప్పుమాటన్నాను పత్రికలలో చదివి ఊళ్ళో పెద్ద మనసులను కొన్న కదా నేనన్నాను. దానికింత కోపపడడానికి కారణం ఏముంది? పంతులుగారి అమ్మాయిని పెళ్ళాడ తాననలేదు. మాలలు మాటాడుకోకూడా స్వతంత్రులు కారా? ఏమో అయినదయ్యి పోనది. నోరు జారినది. ఇప్పుడేమి గతి. 200 అప్పు ఎలాతీర్చడం. ఈ పాకవదలి ఎక్కడికిపోడం? నేనింక అయ్యగోరి రైతునుకూడా కాను. నా జీవనమెలాగా చచ్చినా" యని ఆలోచించాడు.

చీకటిపడినది. ఆ గురువారం సాయంత్రం రామ బ్రహ్మం గారు తన 5 సంవత్సరాల అమ్మాయితో వేణుగోపాలస్వామి కోవెలకు వెళ్లారు. పంతులుగారిని చూడగానే పూజారి వినయముతో ఆహ్వానించాడు.

అమ్మాయిని చూచి "దామ్మా, దేవున్ని చూడు, దండం పెట్టూ" యని రామబ్రహ్మంగార్ని చూచి "పంతులుగారూ, మీ అమ్మాయిది పునర్జన్మయండీ, నిజంగా మన వేణుగోపాల స్వామిదయే. ఈ అమ్మాయి బ్రతికి బట్ట కట్టుతుందనుకో లేదండి."

"అవునవును, నేను స్వామివారికి, అభిషేకార్చనలు చేయిస్తానని చెప్పకున్నాను, మామూలువి కాక, అందుకే ఇప్పుడొచ్చాను. రేపటినుండి వర్ణసంకరమేకదండి, ఆలయానికి రావడానికికూడ ఆశలేనట్టుంది. ప్రొద్దుపోతోంది."

పూజారి అర్చనచేసి కొబ్బరికాయ కొట్టేటప్పటికి ఎక్కడుండినదో, గర్భగృహంలోపలికెలా వచ్చిందో, విగ్రహము వెనుకనున్న నాగుపాము ముందుకొచ్చినది. గర్భ గృహపు గడపమీద పడగెత్తి నిల్చింది. "బాబోయి, పాము పాము" యని పంతులు పూజారి ఇద్దరు కేకేసారు. చేతులుజోడించి నిలుచున్న అమ్మాయిని పంతులుగారు చంక కెత్తుకొని దిగులుతో వెనక్కునడుస్తున్నాడు.

ఎక్కడినించివచ్చాడో వీరడు పామును అతిలాఘవముగ పట్టి గిరగిర త్రిప్పి మూడుసార్లు నేలకేసి కొట్టాడు. పాము చచ్చినది. నోట్లో తడియారిపోయిన పంతులు పూజారి ఇద్దరికి వొంటిమీద తెలివివచ్చినది.

రామబ్రహ్మం "వీరయ్యా, నాడు వేణుగోపాలస్వామి దయవల్ల నా బిడ్డ బ్రతికినది. నేడు నీవల్ల మేముగ్గరం బ్రతికాము. నీ ఋణముతీర్చుకోలేము. అయితే వీరయ్యా! పాము వచ్చిన సంగతి నీకెలా తెలిసినది. నీవు కోవెలలో కెలా వచ్చావ్?"

"సామీ, చమిస్తానంటే మనవిచేత్తాను. మీ పాదాల మీద పడతాను చమించాననండి. సామీ చమించాననండి."

"క్షమించానులేరా, ఎలా వచ్చావ్ కోవెలలోకి?"

"సామీ, మీరు మీ డబ్బుకట్టమని నిక్కచ్చి చేసారా, ఎలా తెస్తాను చెప్పండి. ఈ గుడి తలుపులు మూసాక సామివారి మెళ్ళోని చంద్రహారం తీసుకెల్లి మీ డబ్బు మీకిత్తామన్న బుద్ధిపుట్టింది. అందుకని ఎవరూ చూడనపుడొచ్చి ఆ వాహనం క్రింద దాక్కున్నాను. మీరు పాము పామని కేకెయ్యగానే, అక్కడవుండ బుద్దెయ్యలేదు. వచ్చిపామును చంపాను. గుళ్ళో దూరినందుకు చమించాలి మా రాజా"

"ఎందుకురా చమించడం రేపటినుండి మీ కాలయ ప్రవేశమేగా, రేపొచ్చేది, నేడొచ్చావ్, అంతేనా"

"అదికాదు సామే, నల్లరాతి విగ్రహాని చూడడం యేం గొప్పండి. మీబోటి మనుస్సుల మనస్సనే ఆలయంలో ప్రవేశము లేక పోతే, ఈ ఆలయ ప్రవేశాలు మా కెందుకండీ" యంటూ బయటకు వెళ్ళాడు.

మరునాడాలయ ప్రవేశం, హరిజనుల నందరినీ ప్రవేశపెట్టారు. అందరూ స్వామిని చూడడానికి ఆతురపడుతున్నారు.

అయితే, వీరయ్యమాత్రం రాలేదు. అప్పడెంత బతిమాలుకున్నా, "ఆ నల్లరాయి మనకేం చేస్తుందంటున్నాడు. పంతులుగారు దూరాన్నుండి· యిదంతా చూస్తూ, ముందు రోజు వీరడన్న మాటలు మననం చేసుకుంటున్నారు.



# నేటి విద్యావిధానం మారాలి

శ్రీ వసంతరావు రామకృష్ణరావుగారు

మానవుని జీవన ప్రతిపత్తికి, నేటియుగంలో విద్య అవుసరం - నాగరికతకు, ప్రపంచ పౌరసత్వానికి విద్యాధిక్యత ప్రధానమైనది. జాతి అభ్యుదయానికి, దేశాభ్యున్నతికి విద్యా వ్యాప్తి ఆవశ్యకమని తెలుస్తుంది.

అయితే నేటి మనవిద్యావిధానం ఎట్లావుంది? మనదేశ పరిపాలనాబాధ్యత ప్రజా ప్రతినిధులు, ప్రజా నాయకులు స్వీకరించారు. ప్రజాసామ్య సూత్రాలపై పరిపాలన సాగించడానికి వారు ప్రయత్నిస్తున్నారు. కనుక, మన దేశంలో, భావిలో, సాంఘిక పటుత్వానికి దోహద మీయగల నూతన విద్యావిధానాన్ని, స్వతంత్ర భారత ప్రభుత్వమే, ఏర్పరచుకోవాలి. సాంఘికంగా, ప్రజలకు శక్తిసంపదలు ప్రసాదించగల విద్యాస్వరూపాన్ని మనమే నిర్ణయించుకోవాలి.

నేటి ప్రపంచంలో నాగరికత వ్యాప్తిజెంది ఉన్నప్పటికీ, మానవత్వము పతనముకాగల పరిస్థితులు ఏర్పడుతున్నాయి. అట్టి పతనానికి, సాంఘిక పటుత్వం సన్నగిలటమే ప్రధాన కారణం. సంపూర్ణశక్తి సంపదా, సౌష్ఠవమూగల మానవ సంఘ పునర్నిర్మాణం జరగాలంటే, మనదేశంలో, విద్యా విధానంలో పరిపూర్ణమైన మార్పులు రావాలి. మన విద్యాలయాల దుస్థితి తొలగి పోవాలి. సాంఘిక సౌష్ఠవానికి మూలాధారమైన ఆర్థిక సుస్థిరత్వాన్ని ప్రభుత్వం కలిగించి, మనలో విద్యాశూన్యులకు నైతికంగాను, సాంఘికంగాను విద్యాప్రబోధం చేయాలి. సంఘాభ్యుదయం, జాతీయాభ్యున్నతికి తోడ్పడగల ఉత్తమ విద్యా విధానాన్ని మన ప్రభుత్వము ప్రవేశపెట్టాలి.

లోపభూయిష్ఠమైన, నేటి మన విద్యా విధానం వల్లనే, ప్రపంచంలోని సాటిదేశాలలో, మనగౌరవ ప్రతిపత్తికి భంగము వాటిల్లుతూఉంది. అవిద్య కారణంగా, మన సాంఘిక పటుత్వం సన్నగిలింది. ప్రజా సామాన్యంలో జాతీయ భావాలు క్షీణించి, సంకుచితమైన మతావేశం ప్రబలుతూ వుంది. మరి కొందరు అజ్ఞానులు కేవలం ఆధ్యాత్మిక చింతన చేసియో, వేదాంత తత్త్వాన్ని అలవర్చుకొనియో, తమ కర్తవ్యాన్ని నెరవేర్చుటలేదు. వారిసంఖ్య అధికముగా నుండుట, దేశానికి, ప్రజలకు, ఏవిధంగాను ఉపకరించుటలేదు. అందువల్లనే, మనసంఘాలకు శక్తిక్రమంగా క్షీణిస్తున్నది. సాంఘికశక్తి లోపించిన పిమ్మట, జాతీయ దృక్పథం ఏవిధంగా అలవడుతుంది? దేశ క్షేమానికి వారు ఏవిధంగా పాటుబడగలరు?

కనుక, సంఘము, జాతి, దేశము పురోగమించాలంటే అందరూ సముచితమైన విద్యనభ్యసించాలి. వెంటనే నిరక్షరాస్యత నిర్మూలింపబడాలి. 19వ శతాబ్దంలో ఇంగ్లాండులో, వివిధవర్గాలకు విద్యనభ్యసింపచేసి, వారి ఆ వర్గాల శ్రేయస్సు రక్షించుకొనుటకు, అప్పటి ప్రజానీకానికి ప్రభుత్వము సహాయపడినది. నాటి ఇంగ్లాండు విద్యా విధానం విద్యార్థులకు తమవర్గంపట్ల, ఏ విధమైన నైతిక ధర్మాలను నిర్వర్తించాలో, సేవాదీక్షను ప్రదర్శించాలో, సూచించేది. ముఖ్యంగా, విక్టోరియారాజ్ఞి పాలనలో ప్రవేశ పెట్టబడిన విద్యావిధానం, విద్యార్థులకు తమ విధ్యుక్త ధర్మాలనుప్రబోధించునదిగా వున్నది.

కాబట్టి, మనప్రభుత్వం, సంఘచైతన్యం క్షీణించకుండా, సాంఘిక పునర్నిర్మాణానికి తోడ్పడగల విద్యా విధానం వెంటనే ప్రవేశపెట్టాలి. అది నైతికశక్తి సామర్థ్యాలు ప్రబోధించునట్లుగా ఉండాలి. సంఘంలో, దేశంలో, పౌరుడు, బాధ్యతాయుతమైన జీవన ప్రతిపత్తి కల్పించుకోడానికి, అతడు విద్యార్థిగా ఉన్నపుడే వలసిన ప్రబోధం చేయడం అవుసరం.

మన విద్య ఎట్లు ఉండాలి? మనవిద్య విజ్ఞానాధిక్యతను కలిగించాలి. మన ప్రాచీన సాంప్రదాయాన్ని కొంత వరకు అనుసరించాలి. మన నూతన విద్యాసంస్థలలో మాటివిద్యలకు

ఉద్యోగ విద్యలకు తావుండరాదు. బ్రిటిషువారి ప్రవేశంతో మనదేశంలో ప్రారంభమైన ఈ ఉద్యోగ విద్యను పూర్తిగా మార్చివేయాలి. మన విద్యా విధానాన్ని విద్యా సంస్థలను పూర్తిగా సంస్కరించి సముచితమైన వాటిని మనం ఏర్పరుచుకోవాలి.

ఎందువల్లనంటే, భారతజాతీయ జీవన సాంప్రదాయాన్ని అలవర్చగల విద్యావిధానం నేడు అవుసరం. విద్యా విషయికమైన మార్పులద్వారా, కూటివిద్యకు స్వస్తిచెప్పి, అందరకూ సమానమైన జీవనప్రతిపత్తిని కల్పించాలి. మన విద్యాలయాల కార్యక్రమం స్వార్థపరుల హస్తగతం కాకూడదు. పాఠశాలలోని పాలకపాలిత వర్గాలకు జాతీయాభిమానం కల్పించగల విద్యావిధానం నిర్ణయించుకోవాలి.

అద్యతన భావిలో, మన దేశములో, స్వచ్ఛందమైన జాతీయవిద్య ప్రవేశపెట్టబడాలి. దేశీయమైన, జీవనప్రాయమైన విద్యావిధానం అమలులోకి రావాలి. ఆవిధంగా, సమగ్రమైన, సౌష్టవమైన విద్యా విధానంవల్లనే భారత యువకులు సమర్థతగల పౌరులుగా తయారుకాగలరు. అట్టి దృక్పథంతోనే, సముజ్జ్వలాశయాలు, జాతీయ లక్షణాలుగల, సర్వ సౌష్ఠవమైన, విద్యా విధానాన్ని భారత ప్రభుత్వం వెంటనే ప్రవేశపెట్టాలి.



## లీలాసుందరి



పిల్లల కథ, రచయిత : చింతా దీక్షితులుగారు. ప్రకాశకులు: త్రివేణి పబ్లిషర్సు, మచిలీపట్టణం :

పేజీలు 38. చక్కని ప్రింటింగ్, మనోహరమైన గెటప్, మంచి కాగితము. కొంచము చదువ గలిగిన బాలబాలికలకు అతి సులభంగా అర్థమయ్యే శైలిలో మృదు మధురమైన మాటలతో వ్రాశారు. కథ కల్పితమైనది. లీలాసుందరి ఒక రాజు కూతురు. చిన్నప్పుడే ఆ అమ్మాయిని ఒక రాక్షసి బాలిక రూపంలోవచ్చి ఎత్తుకుపోతుంది. లీలాసుందరి చాలా రోజులు అక్కడే ఉండి అదృష్టవశాత్తు అక్కడకు వచ్చిన ఒక రాకుమారునితో, రాక్షసి గృహము నుండి తప్పించుకొని తండ్రి యింటికి వచ్చేస్తుంది. తనతోపాటు ఇతర రాకుమార్తెలనుకూడా రక్షిస్తుంది. కథ బాలబాలికల కోమలమైన మనస్సులను భయకంపితం చేసి భయస్తులనుగా చేస్తుంది. పిల్లలకు విజ్ఞానమును కలిగించే రచనలు బాలసాహిత్యంలో లేకపోవుట తెలుగు భాషకు చాలా కొరత.

## ఇండియా

రచయితలు : మార్క్సు - ఏంజల్సులు ; అనువాదకులు : జగన్మోహన్; ప్రకాశకులు : విశ్వసాహిత్యమాల, రాజమండ్రి వెల రు. 1/-

మార్క్సు ఇండియాను గురించి న్యూయార్కు డైలీ ట్రిబ్యూన్‌లో 1853 జూన్ మొదలు ఆగష్టు 8 వ తేదీ వరకు ప్రచురించిన లేఖలు ఈ పుస్తకంలో అనువదింప బడినవి. తెల్లని కాగితం, అచ్చు చక్కగా ఉంది. ఇందులో మార్క్సుకు, ఏంజల్సుకు జరిగిన ఉత్తరప్రత్యుత్తరములుకూడ ప్రచురింపబడినాయి. భారత దేశపు ప్రాచీన సౌభాగ్యము నాగరికత చూస్తే ప్రపంచానికి మన దొక విచిత్ర దేశం. సంపదల కాలవాలం. రత్న గర్భ అనీ, పూర్వం ఒకప్పుడు ఇక్కడ రామరాజ్యముండేదని రచయిత అభిప్రాయాలు. ఈ దృక్పథంతో రచయిత ఇప్పటి భారత దేశాన్ని పరీక్షించి చూచాడు. పాశ్చాత్యుల దాస్య శృంఖలాలలో భారతీయులు ఆర్థిక, సాంఘిక, సాంస్కృతి దుర్వ్యవస్థలకు లోనై, పురాతన ఔన్నత్యాన్ని ఏలా పోగొట్టుకొన్నారో యీ లేఖలలో వివరింపబడింది. పాశ్చాత్యులు, డబ్బు గడించుకోడానికి ఇండియాలో చేరి ఎన్నెన్ని దుష్కృత్యాల ద్వారా సామ్రాజాన్ని స్థాపించారో చక్కగా వివరింపబడింది, మూఢ మతా వేశాలను పురిగొల్పి మానవ సంహారము చేయిస్తున్నది. భారత దేశంలో పాశ్చాత్యులేనని ఏనాడో మార్క్సువ్రాసి పెట్టాడు. ఈ పుస్తకంలో హిందూ దేశంపై పాశ్చాత్యుల ఆక్రమణకు సంబంధించిన అన్ని రహస్యాలూ ఉన్నాయి. చదువ గల ప్రతి భారతీయుడు చదువవలసిన పుస్తకమిది.

## ఉదయిని

ఖండ కావ్యం : కవి వేదాంతం నరసింహారెడ్డిగారు. తలమర్ల, అనంతపురం జిల్లా. వెల· అణాలు 8.

కవి ముద్రిత గ్రంథాలలోనిది ఐదవది. భర్తయగు బయపరెడ్డిగారి స్మృతి చిహ్నంగా ఆయన భార్య స్థాపించిన ఆశ్రమమును చూచి, కవి యీ చిన్ని ఖండకావ్యము వ్రాసినట్లుగా వ్రాసుకున్నారు. ఇందులో శాంతమ్మగారి ప్రేమ పూరిత శాంత హృదయాన్ని, సంఘ సేవాభిలాషను చక్కని పద్యాలలో కవి వర్ణించాడు. మచ్చుకు "ముక్తియన ప్రజాసేవయే ముఖ్యమయ్యె, కాంక్షయే దుఃఖజనకంబు." వంటి అనేక అమృత వాక్యాలు ఈ పుస్తకంలో

# గ్రంథసమీక్ష

కనుపిస్తాయి. చక్కని ధారా వాహికమైన శైలి. తెల్ల కాగితం మీద చక్కగా ముద్రింప బడింది.

## ప్రవాసి ✓

జన్మదిన సంచిక (డిసెంబరు 1948) సంపాదకుడు : వజ్ఝల కాళిదాసు.

"ప్రవాసి" సచిత్ర మాసపత్రిక. జెమ్‌షెడ్ పూర్‌లోని "ఆంధ్ర విజ్ఞాన సమితి" ద్వారా ప్రచురింపబడుచున్నది. అచ్చటి ఆంధ్రుల రచనలకు ప్రాధాన్య మిచ్చు పత్రిక. ఈ సంచికలో చాల హాస్య రచనలు, కథలు, పద్యాలు, విజ్ఞాన విషయాలు మొదలగు రచనలున్నాయి. శ్రీయుత పండిత ఆకుండి వెంకట శాస్త్రిగారమోఘాశీస్సులిచ్చారు. "సోమయ్య" "మనియార్డర్" రచనలు బాగున్నాయి. "చిత్రశాల" అనే శీర్షిక క్రిందనుండే విషయాలు చాల చిత్రంగాను, ఆశ్చర్యకరంగాను వున్నవి. "ప్రవాసి" ని మన తెలుగు వారంతా యెక్కువ ఆదరించి, ఆ పత్రికాభివృద్ధికి చాల సహాయకారు లగుదురని భావించుచున్నాము.